# జీవితాదర్శం

[నవల]

చలం

శ్రీ గోపాలకృష్ణ పబ్లికేషన్సు
చుట్టుగుంట : : విజయవాడ-4

# జీవితాదర్శం

సింహాసనాలమీద కూచుని చూస్తున్నారు బిలియర్డు ఆటవాళ్ళు ముగ్గురూ. నరసింహారావు అమెరికన్ పత్రిక తిరగేస్తూ ఒక బీచి పటం దగ్గిర ఆగిపోయినాడు. నీల సముద్రం, పైన రెండుమూడు మబ్బులూ, ముందు తెల్లని ఇసికా, ఆ ఇసికమీదా, అలల్లోనూ, వొంటిలో చాలాభాగం కనపడుతో ఆడవాళ్ళూ, రెండు మూడు కుక్కలూ, ఇద్దరు మొగవాళ్ళూ, పిల్లలూ, ఎండలో మెరిసే నురుగులో దూకుతున్నారు. కొందరు గొడుగులు క్రింద తలలు పెట్టి పడుకున్నారు.

"మన దేశంలో ఇట్లాంటిబీచి ఎక్కడా వుండదేం?"

"అట్లాంటి బీచి అంటే, అట్లా బట్టలులేని ఆడవాళ్లు ఆడుకునే బీచి అనా నీ సందేహం?" అన్నాడు లక్ష్మణ్‌సింగ్.

"కాదోయ్. అసలు ఆ ఇసికా, ఆ శుభ్రం..."

"ఏం మద్రాసు లేదూ?"

"మద్రాసా? ఈ అందం ఎక్కడ వుంది!"

"లేకేం? నీ కళ్ళల్లో ఆ అందమంతా ఆ మనుష్యుల వల్ల కలిగినట్టుంది. మనుష్యులూ వున్నారు, కాని బట్టలు లేకుండా కనబడరు." అన్నాడు వెంకయ్యనాయుడు.

"వెక్కిరించకండి. ఎండా, ఆకాశం, సముద్రం ఇంత అందంగా ఎక్కడ వుందీ?"

"ఎక్కడైనా వుంది."

"పట్టణాలు తోసెయ్యి."

"భీమ్లీ వెళ్ళు."

"భీమ్లీ?"

"అవును."

"ఏమిటి విశేషం?"

వర్ణించాడు నాయుడు. అది వుండిపోయింది వాళ్ళిద్దరి మనస్సుల్లో. చైత్రమాసంలో షికారు వచ్చారు భీమ్లీ, అనంతపురంనించీ, నరసింహారావూ, లక్ష్మణసింగ్. వొచ్చిన రెండోరోజే ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటున్నారు. తిరిగి వెళ్ళాక వెంకయ్యనాయుణ్ణి ఏం చెయ్యాలని ఆలోచన. కాని నాయుడు చేసిన మోసం ఎక్కడ

వుందో వాళ్ళకు తెలీటంలేదు. మోసంలేదు. అందువల్లనే మోసం యెక్కడ వుందో కనుక్కోవడం కష్టంగావుంది. మొత్తానికి ఇద్దరికీ ఎందుకు వొచ్చామూ ఇంతదూరం అనిపిస్తోంది. వెళ్ళిపోవాలంటే వాళ్ళకే సిగ్గుగావుంది, రెండు నెలలకుగాని తిరిగిరామని చెప్పివచ్చి వారం రోజులకే మళ్ళీ అనంతపురంలో మొహాలు కనబర్చటం. రాజమండ్రిలో, కాకినాడలో బంధువులున్నారు. అక్కడ వుందామూ రెండు నెలలు అనికూడా ఆలోచించారు.

కొత్తవూళ్ళో ఎవరన్నా తెలిసినవాళ్లు వుంటేగాని తోచదు, అందులో అప్పుడే కాలేజీ ముగించిన కుర్రాడు నరసింహారావు. సింగ్ వకీలుగాని ఇంకా ఏం ప్రాక్టీస్ లేదు. మనుష్యుల్ని పలకరించారు బీచిమీద. కాని వాళ్లు రెండు మాటలు మాట్లాడి వెళ్ళిపోతారు. వాళ్ళ అనంతపురంలో మనుష్యులు వేరే రకమనిపించింది.

సముద్రంవంచనే వడివడిగానడుస్తున్నాడు ఒకతను. సూటు, బూటు, గాలిలో యెగిరే టై, సాయంత్రపు ఇంగ్లీషుటోపీ, చేతిలో బెత్తం – లావుగా వుంటాడు. మెలి తిరిగిన తెల్లటి మీసాలు. సగం తెల్లటి జాతిమనిషి గావును. నడకలో, చూపులో, మాటలో, అమితమైన ఉత్సాహం, స్నేహభావం. మూడు రోజులనించీ ప్రతి సాయంత్రం చూస్తున్నారు అతన్ని సముద్రంవొడ్డున. అతను అక్కడేవున్న క్లబ్ కిపోడు. బీచిలో ఓ చివర ప్రారంభిస్తాడు, వడి వడిగా వడుస్తూ. కనపడ్డ ప్రతివాళ్ళనీ పలక

రిస్తాడు. యూరోపియన్లనీ, కుట్టుకునే ముసలమ్మల్నీ, చిన్నపిల్లల్నీ, బళ్ళలో పడుకున్న బేబీలనీ, పల్లెవాళ్ళనీ, శాస్త్రిల్లనీ, యువతుల్నీ, ఒక్కొక్కరిదగ్గిర యొంతోసేపు ఆగుతాడు. వాళ్ళతో పరియాచకాలు ఆడతాడు. వాళ్ళని వొదిలి చాలా తొందరపని జ్ఞాపకం వొచ్చినట్లు చర చర నడుస్తాడు, ఇంకోరు కనపడ్డదాకా. యెవరితోనూ పూర్తిగా ఆగిపోడు. అందరూ అతనికి తెలుసా ? లేక యెవర్నయినా పలకరిస్తాడా ? స్నేహానికి మొహంవాచిన వాళ్ళిద్దరూ చూశారు, తమని పలకరిస్తాడేమోనని. దగ్గరికి వచ్చాడు పలకరించేట్టే ! కాని మొహాలుచూచి వెళ్ళిపోయినాడు మూడు రోజులుకూడా. ఇవాళ తామే పలకరించా లనుకు న్నారు చాలా సరదాఅయిన వాడిలాగున్నాడు. అదిగాక అతన్నిచూస్తే, అతనిమొహం తామెరిగిన, అంటే చూసిన, మనిషిమొహంలాగుంది. ఆ గుండ్రటి గడ్డం, సూదుల్లాంటి కళ్లూ, కణతలమీద వుంగ్రాలు తిరిగే జుట్టూ, బలువైన చంపలూ, యెవరబ్బా ఇట్లాంటిమనిషి ? మళ్ళీ తమకి యెదురుగా వస్తున్నాడు. మాట్లాడాలి. కాని చొరవ చాల లేదు ఆ నిమిషానికి. ఆ వెనక అబ్బాయితో ఆడిన అల్లరిమాటల జ్ఞాపకం నవ్వుతో వొచ్చాడు ఈ సారి.

"గుడీవినింగ్" అన్నాడు.

ఇద్దరూ "గుడ్ ఈవినింగ్" అన్నారు.

"వేడిగా వుందికదూ ఇవాళ ?"

ఎంత సులభం,అతని సంభాషణ ! యెంత ప్రయత్నించినా తమకి నోట మాట రాదేం ?

"వేడా! ఏం వేడి? చాలా బావుంది."

"ఏం బావుంది? ఏమీ బావున్నట్టులేవు మీ మొహాలు! యెక్కణ్ణించి వొచ్చారు?"

ఆ మాటతో వాళ్ళ సంగతులు, అతనితో చెప్పుకున్నారు.

"అనంతపురం నుంచా? చాలా దూరం. కొత్తగా వుండాలే పాపం!"

అతని కంఠంలో సానుభూతి, దయ, ఇబ్బందిని అర్థం చేసుకున్న హృదయం. బావురుమని ఏడవాలనిపించింది. "బంధువులున్నారా? లేరా? మరి యెక్కడదిగారు? సత్రంలోనా? బాగానే వుంటుంది. భోజనం?"

"భోజనమా? ఈ వూరొచ్చి భోజనం చేశామంటారా? ఇదేం దేశం?" అన్నారు.

"ఆ హోటలు భోజనమేనా? బ్రతికివున్నారు విచిత్రమే! పోని బసలో ఆ కుర్రాడు మిమ్మల్ని సరిగా చూస్తున్నాడా?"

"ఎవరూ చూడనక్కర్లేదు, తిండి దొరికితే?"

ఆలోచించాడు.

"మా వంటమనిషికి స్ఫోటకం. మేమూ ఇబ్బంది పడుతున్నాం. వుండండి. ఆమూల కాఫీహోటలుకి వెళ్ళి భోజనం పెట్టమని అడగండి, అతను మిమ్మల్ని కొట్టడానికి

మీద పడతాడు. జడుసుకోక, నిలబడి దేశికాచారి పంపాడనండి. భోజనానికి పూటకి యిరవైమూడు రూపాయలడుగుతాడు. సరేనని భోజనంచేసి ఇద్దరికీ రూపాయన్నర ఇవ్వండి. మీ మొహాన విసిరి కొడతాడు డబ్బులిన్ని. మళ్ళీ దేశికాచారిని జ్ఞాపకం చెయ్యండి. తొరగా వెళ్ళండి. పొద్దుపోతోంది. వంటకి టైముండదు అతనికి మళ్ళీ" అని వెళ్ళిపోయినాడు. వెనక్కి తిరిగి చూడకండా, వొంటరిగా, ఇంట్లో విడిచి సినిమాకి తల్లి వెళ్ళిపోయిన పిల్లలాగైనారు వాళ్ళిద్దరూ. అయితేనేం, అతని ధర్మమా అని హాయిగా భోజనం చేశారు ఆ రాత్రికి. వాళ్ళకి సముద్రమూ, చల్లని గాలీ; అందాల దృశ్యాలూ పట్టటంలేదు. మళ్ళీ ఆయన యెప్పుడు కనబడతాడా అనే.

"దేశికాచారి! ఎవరు? అతనా? యెక్కడో తెలుసు? ఇతను" అంటున్నాడు నరసింహారావు.

"ఏమిటి? ఆ వంటమనిషికి జబ్బు రాకపోతే మనని తన ఇంట్లో పెట్టుకునేటట్లు మాట్లాడాడే!"

"మన అదృష్టం!"

"ఇక భోజనం సమస్యమాత్రం తీరినట్టే! ఏం వంటా! ఆ మైసూరు రసం చాలదా?"

మర్నాడు సాయంత్రం నవ్వుతో వొచ్చాడు, "గుడ్ ఈవినింగ్ బాయ్సు" అనుకుంటో.

"కొంత కోపం తీరిందా భీమ్లీమీద?" అని అడిగాడు.

వాళ్ల మనస్సుల్లో జరిగేది యెలా కనిపెడుతున్నాడు?

"అనంతపురంవాళ్లు వొచ్చి, ఇదేం తిండి? అంటే ఈ భీమ్లీ వాళ్ళకి యెంత కోపం వస్తుందని! ఆ జిల్లాలో జొన్నకూడు తింటారని వీళ్ళ అభిప్రాయం. యెందుకు! అనంతపురంలో దోసకాయ పప్పువంటిది వీళ్ల జన్మలో రుచిచూసి వుంటారా? డబ్బు వున్నవాళ్ళు ఆ దేశంలో తిండికోసం బతుకుతారని తెలీదు వీళ్లకి! వాంగీబాతు అంటే అదేదో తిట్టనుకుంటారు వీళ్ళు."

తమని పొగడుతున్నాడో, యెక్కిరిస్తున్నాడో అనుమాన మయింది వాళ్లకి.

"ఇంత అందంగా వుందా ఇక్కడ? షికారు అయిపోయే సమయానికి, ఇంటిదగ్గిర బంగాళాదుంపల వేపుడూ, కొబ్బరి పెరుగుపచ్చడీ తయారౌతున్నయికదా సరైన రుచిలో, అనే జ్ఞాపకంతో అడుగు తొందరగా పడాలి. ఇంటిదగ్గర మధ్యాన్నం బజ్జీలూ, టీ తీసుకొంటో వుండగా బీచి మన రాకకోసం అలంకరించుకొంటోందా లేదా అని అడుగులు తొందరగా పడాలి. అవునా?"

ఎంత వుత్సాహం, హాయి అయిన అనుభవం ఆ మాటల్లో? తెల్లబోయి చూస్తున్నారు.

ఇంకా విప్పారలేదు మొహాలు. ఏమిటి బాధ ?"

"ఎందుకు వొచ్చామా ? అనుకుంటున్నాము."

"ఏం ?"

"ఏం తోచదు."

"అవును పాపం ! సత్రం దగ్గిరా, ఇక్కడా ?"

"బాగానే వుంది. కాని ఏముంది చూడడానికి ?"

"కళ్ళు తెరవరాదూ ?"

"అంటే ?"

"భీమ్లీ వొచ్చి అలా అడిగితే నేనేం చెప్పను ? బతికివుండగా ఇలాంటి అందం ఎక్కడ చూస్తారు మీరు ? ఏదో చెడిపోయింది మీలో" అని ఆలోచించి "కొత్త అవునా? ఏం తోచదు. అవును ... నా భార్య వొంట్లో బాగాలేదు. వెళ్ళాలి" అని వాళ్లని వొదిలి నిమిషంలో వేగం హెచ్చించాడు. వెళ్ళిపోతున్నాడని పెద్ద దిగులు వాళ్ళకి. చప్పున లేచి అతని వెంట పడ్డారు.

"మేమూ నడుస్తాం."

"రండి, నిరాశపడి ఈ వూరు విడిచి వెళ్ళిపోకండేం ? రేపటిదాకానన్నా వుండండి" అన్నాడు. బీచి నుంచి రోడ్డుమీదికి ఎక్కుతో చీకట్లో రోడ్డుమీద ఆగి, కేకేశాడు.

"ఎందుకో ఉండమంటున్నా నన్నుర్శోకండి. ఆశ్చర్యపడుత్తో ఊహించకండి. ఏం లేదు, ఇంతదూరం వొచ్చి అందులో భీమ్లీకి, ఉత్తచేతులతో దరిద్రులమల్లే తిరిగి వెళతారా? భీమ్లీవచ్చి?" అనుకుంటో వెళ్ళిపోయినాడు. ఆ మాటలు అసలు అర్థంకాలేదు వాళ్ళకి. ఆవాళనించి వాళ్ళకి ఓ సంగతి దొరికింది. ఆ కొత్త ఆతను, అతని మనో విశాలత్వం, ఆతిథ్యదృష్టి, తనలోకి ఎవరినన్నా ఆకర్షించుకునే శక్తి ఒకటే ఆశ్చర్యం వాళ్ళకి—ఈ దేశంలో ఇట్లాంటి వాళ్ళున్నారా అని. పేరు దేశికాచారి అని చెప్పాడుగాని, అతను ఇంగ్లీషులో ఇంగ్లీషు అతనిలాగు మాట్లాడుతున్నాడు. హోటలు అతన్ని దేశికాచారి ఎవరు అని అడిగితే, "దేశికాచారి ఎవరేమిటి?" అని వెళ్ళిపోయినాడు. ఇంకెవర్ని వాళ్ళు అడగలేదు. అతన్ని ప్రత్యేక ధనమైనట్టు దాచుకున్నారు మనసుల్లో.

మర్నాడు మధ్యాన్నం దేశికాచారి వాళ్ళ సత్రానికివొచ్చి కూచున్నాడు. వాళ్ళు తెలుగులో మాట్లాడినా అతను మాత్రం ఇంగ్లీషులోనే మాట్లాడతాడు. వాళ్ళు తెచ్చుకున్న పుస్తకాలు చూశాడు.

"ఏమిటి ఇంకా ఎడ్గార్ వాల్లస్ చదువుతున్నారా? పీటర్ చేనీ చదవండి. నాలుగైదు పుస్తకాల వరకు భరించవొచ్చు. కథలు బావుంటాయిగాని, ఇప్పుడు సైన్సు, ట్రావెల్, హిస్టరీ కూడా కథలకన్న ఆకర్షణగా రాస్తున్నారు చూశారా? ఈ రెండో ప్రపంచ యుద్ధం రియాక్షన్స

ఇంగ్లీషువారి వాఙ్మయంమీద ఎట్లా వొచ్చాయంటారు? ఇంగ్లండుకన్న అమెరికాలో స్పష్టంగా కనపడుతున్నాయి" అన్నాడు.

నోళ్ళు వెళ్ళాడేసుకు చూశారు.

వాళ్ళదగ్గిర తెలుగు పత్రికలు చూశాడు.

"చలంకన్న శరత్తు ఎందుకు ఎక్కువ ఆదరణ పొందుతున్నాడో తెలుసా మీకు?" అన్నాడు ఇంగ్లీషులోనే.

ఇట్లా మాట్లాడుకుంటో బీచికి వెళ్ళారు.

కొంచెంసేపు మాట్లాడకండా నీళ్ళపక్కన నడిచి నవ్వాడు. ఏమిటని చూశారు వాళ్ళు.

"మీ మొహాలు" అని తనలోపల నవ్వుకుంటున్నాడు.

"నీళ్ళుపోసిన మొక్కలమల్లే అయినాయి. పాపం చాలా వొంటరై పోయినారు" అని వాళ్ళ భుజాలమీద తట్టాడు.

"మనుష్యులకు స్నేహం చాలా అవసరం. కాని నాబోటివాడికి మనుష్యులనేవాళ్ళు లేకండా బతకడం నేర్చుకోవాల్సిన అవసరం పడుతుంది."

ఇదేమిటి? ఇంత మానవ ప్రియుడికి అట్లాంటి గతేమిటి?

"అట్లాంటప్పుడు వినండి. భీమ్లీ చాలా అందమని విని వొచ్చారు కదా! ప్రత్యేకం ఏం అందం చూశారు?"

"సముద్రం, ఇంకా... ...."

"అవన్నీ మామూలు మాటలు ఇట్లా రండి"

అని అక్కడ కొండరాళ్ళమీదకి తీసికెళ్ళి, నిలవ నీళ్ళలో భక్తితో, భద్రంగా నాచుని చూపాడు. "చూడండి ఈ రంగు, మెరుపు, మెత్తదనం ఎండతో ఎన్నెన్ని విధాల మారుతుంది? పొద్దున్నే రండి. రేపు పొద్దున్నకి నీరింకా దూరంగా వెడుతుంది. ఇట్లాంటి రాళ్ళల్లో చిన్న చిన్న చెరువులున్నాయే వాటిల్లో ఓదానిముందు కూచుని విసుగెత్తినాసరే, చూస్తో కూచోండి నేను చెప్పానని. ఎండ, రాళ్ళక్రింద నీడల్లో ఉండిపోయిన చిన్న చేపలు ఈ నీచులోంచి ఈదుతో—ఎన్ని విచిత్రాలు అందాలు చూడగలరో, ఈ గుంటల్లోనే - ఆలోచించగల ప్రాణులుంటే, నిన్న అలలతో ఘోష ఎత్తిన సముద్రం, అలవెంబడి అల ముంచేస్తో పొంగుతో కిందికి పొర్లి పొంగి పడిపోయే నీళ్ళన్నీ ఏమైనా యనుకుంటాయి? దూరంగా ఎక్కడో విని పించీ వినపడకుండా హోరు పెట్టే సముద్రాన్నే మరిచిపోయి, ఈ గుంటే జీవితమని, మనలోని జీవాత్మలే స్వయం నిర్ణయంగా బతుకుతాయి. అవతల పెద్దసముద్రం వుందనీ, ఈ గుంటకి అదే అర్థమనీ అంటే, నవ్వుతాయి—మళ్ళీ సముద్రం పొంగివొచ్చి ముంచేసిందాకా. ఆ సముద్రమే రాకపోతే మురుగుతుంది. చివరికి ఎండి, అర్థంలేకుండా పోతుంది.

ఈ భీమ్లీకి ఒకవిధంగా కాదు, అనేకమైన అందాలు పట్టాయి - కొండలు, నది, అడవి, సముద్రంలో వరసగా ఈ రాళ్లు! - నేను చెప్పి ఏం లాభం? చూడండి. బుద్ధిమంతుల్లాగున్నారు" అంటో బయలుదేరి వెళ్ళిపోయినాడు, బీచి

నంతో వరసగా పలకరించడానికి. నాలుగు గజాలు వెళ్లాడో లేదో! తెల్లవాళ్ళ అమ్మాయీ, అబ్బాయి ఒకరిమీద ఒకరు చేతులు వేసుకొని సముద్రంవంక చూస్తున్నారు. కాసేపటికి చూస్తే వాళ్ళిద్దరిమధ్యా కూచుని వున్నాడు. ఇద్దరూ చెరోవేపూ ఆతనిమీద చేతులు వేసుకుని పకపక నవ్వుతున్నారు అతనితో కలిసి.

ఆ రోజునుంచి వాళ్ళకి భీమ్లీమీద కొత్త ఉత్సాహం వొచ్చింది. ఆ సముద్రంచాలు వాళ్ళ కళ్ళని కట్టేసి, వాళ్ళకి వాళ్ళలో ఉన్నదని తెలీని సౌందర్య భావానికి సందేశం ఇవ్వడానికి. వాళ్ళు యోచించకుండానే, ప్రయత్నించకండానే, అందాన్ని గ్రహిస్తున్నట్టుగా ఐనాయి వాళ్ళ మనసులు.

"ఏంలేదు. మన మనసులమీద మూతల్ని దేశికాచారి తీసేశాడు." తక్కినపని భీమ్లీ చేసేస్తోంది. అనుకున్నారు వాళ్ళల్లోవాళ్ళు.

మర్నాడు సాయంత్రం అతను ఎక్కువసేపుఆగలేదు వాళ్ళదగ్గిర. చాలామందివొచ్చారు బీచికి—సముద్రంలోంచి లేస్తున్న నిండు చంద్రుణ్ణి చూడడానికో ఏమో! వాళ్ళందరినీ పలకరించాలి దేశికాచారి. వ్యవధిలేదు. ఆ సముద్రతీరం తనదైనట్టూ, అక్కడికి వొచ్చేవాళ్ళందరూ తన సొంత అతిథులైనట్టూ, వర్తిస్తున్నాడు అతను. హిందూదేశం వొదిలి ఎక్కడికో వొచ్చాం అనిపిస్తోంది వాళ్ళకి.

"రేపు పొద్దున్నే ఆ గుడిలేదూ, ఆ కొండ నెక్కండి, మెట్లున్నాయి కాని గుడికి పైనలేవు మీరు ఆ కొండపైకి వెళ్ళిపోవాలి. పైకి చేరేప్పటికి సూర్యోదయం కాకూడదు

ఇంకా. పైన నీళ్ళున్నాయి చిన్న చిన్న కొండ దొరువుల్లో. చాలా అందం. రేపు సాయంత్రం తీరుబడిగా మాట్లాడుకుందాం" అంటో వెళ్ళిపోయినాడు. అప్పుడే అతనికోసం చేతులు వూపుతున్నారు అందరూ.

వాళ్ళిద్దరూ సముద్రం వొడ్డున రాళ్ళకి తగిలి చిందే నీళ్ళ అందాన్ని చూస్తున్నారు. వాళ్ళకి అనుమానంగా కూడా వుంది. ఎందుకతను అంత స్నేహం చూపుతున్నాడు తమమీద! చివరకు డబ్బులాగుతాడా? ఎందుకో అతనిమీద పూర్తి నమ్మకం రావటంలేదు.

ఇంటికి వెళుతోవుంటే బీచిరోడ్డుమీద వాళ్ళని వెనకనించి కలుసుకున్నాడు.

"మరిచిపోయినాను మీతో చెప్పడం. నా భార్య ఆరోగ్యంగా వుంది. రేపు సాయంత్రం మా ఇంటికి వెడదాం. భోజనం అక్కడే" అంటో వెళ్ళిపోయినాడు తొరతొరగా నడుస్తో. ఎలక్ట్రిక్ దీపానికి దూరమౌతున్న అతన్ని చూసి ఏమి మనిషా అని నివ్వెర పోయినారు.

కొత్త వూరు, ఇంకా ఏ సంధు ఎక్కడికి పోతుందో తెలీదు. ఏ నిముషాన ఏం కొత్త చూస్తామో అనే వండర్ వాళ్ళ మనసుల్లో.

మర్నాడు సాయంత్రం చీకటిపడేప్పుడు వాళ్ళ దగ్గిరికి వొచ్చి పిలుచుకుని వెళ్ళాడు. చాలాదూరం నడిచారు నల్లని కొండవేపు. దీపాలు కూడా కనబడటం మానేశాయి. కొండ రాళ్ళమీదనుంచి కొంత ఎక్కాలి. కొండపక్కన కట్టారు ఆ చిన్న బంగళా. ముందు వరండా సముద్రంకేసి

వుంది. దానికింద చిన్నతోట, రెండుమూడు రకాల పువ్వుల పరిమళం. వరండాలో నాలుగు తొట్లల్లో మొక్కలు. ఎలక్ట్రిక్ దీపానికి చైనాషేడు. ఎత్తుతక్కువ కుర్చీలలో శ్రద్ధగా అల్లిన లేసు గలేబుల దిళ్ళు. టోపీ తగిలించి వాళ్ళతో కూచున్నాడు. బట్లరు నిమ్మరసం తెచ్చియిచ్చాడు. కాని రాత్రి ఐతే భయంకాదా అనిపించింది. కొండమీద అంతా అల్లుకుని దట్టంగా చెట్లూ, తీగెలూ. ఇల్లు నిశ్శబ్దం.

"ఈ వూరు ఇండియాలో వుంది గనుకగాని, లేక పోతేనా, ఈ కొండ పక్కలన్నీ బాగుచేయించి, విల్లాలు కట్టేవారుకాదా?" అన్నాడు అతను.

"ఈ బ్రిటిషువాళ్ళు పోనీండి" అన్నాడు నరసింహా రావు.

"బ్రిటిషువారేం అడ్డమొచ్చారు?"

"ధనం!"

"ఏం ధనవంతులు లేరా? వాళ్ళెక్కడ కట్టు కున్నారు యిళ్ళు? పాడుబడ్డ ఆ పెద్ద పెద్ద మేడలన్నీ ఎవరివి? ఏ లోపాలకీ కారణం ఎవరి మీదో ఒకరిమీద-చివరికి దేవునిమీద పెట్టడం ధీరుల లక్షణంకాదు. అంతకన్న ఒప్పు కుంటే ఏం పోయింది? అనుభవించడం పెద్ద ముఖ్యం కాదని! మన స్వభావం అది."

"కాని ఆ గుడి చూడండి!"

"అవును. యిన్నియుగాల చరిత్రలో ఎవరో బుద్ధి, అందం తెలిసిన మనిషి పుట్టి వుండకపోడు. ఎక్కడొక్కడో

బిచ్చమెత్తి కట్టించి వుంటాడు. లేక ఏ మొక్కుకున్న మహా
రాజుకో ఆ స్థలంచూపించి వుంటాడు, అక్కడ ఏ విష్ణు
దేవుడో వెలిశాడని. అంత ఎందుకు? గొప్ప సూర్యాస్త
మయం సముద్రం అలల్ని బంగారంతో, వజ్రాలతో వెద
జల్లుతోవుంటే, దానికి వీపులుతిప్పి బ్రిడ్జిఆడే క్లబ్బు సోద
గుల్ని చూడలేదా మీరు అక్కడ! ఎవడో కన్ను వున్న
వాడు కట్టాడు క్లబ్బు. దానితో తీరిపోయింది. బ్రిటిషు
వాళ్లట, అడ్డు. ఇక్కడికి వొచ్చే ఇంగ్లీషువాళ్ళకి ఏం సం
స్కారముంది? కాని వాళ్ళ ఇళ్ళు చూశారా? వాళ్ళు ఉండ
బట్టే ఈ మాత్రం అందంవుంది దేశంలో."

"వాళ్ళు వుండాలంటారా?"

"నిస్సందేహంగా!"

"స్వతంత్రం ఒక గొప్ప విషయంగా కనపడదా?"

"నాకు కనబడక పోవడమేమిటి? పదేళ్ళు జైలు జీవి
తం అనుభవించినవాడికి!"

"మీరు జైలుకివెళ్లారా? పదేళ్ళే! ఎంత క్రూరమైన
శిక్ష! చూశారా? ఎందుకు? దేశభక్తికా?"

"దేశభక్తి ఏమిటి? నా తెలివివల్ల. అతను ఇంగ్లీషు
జడ్జీ హ్యూమర్ ఉన్నవాడు గనక కానీ, నాకు ఇరవై ఏళ్ళ
శిక్ష తప్పదనుకున్నాను."

"ఏమీ?"

"ఏమీ వినలేదా నా కేసు? చిన్నవాళ్లేమో! నా
ఫొటోతో ప్రతి పేపరు కేసునంతా. రిపోర్టు చేసింది"
అన్నాడు గర్వంగా.

"ఏం కేసు?"

"దేశికాచారి డిఫామేషన్ కేసు."

"ఓ !!"

వాళ్ళిద్దరికీ జ్ఞాపకం. అదీ, ఇతన్ని ఎక్కడో చూశా మని అందుకనే అనుకున్నారు. పేపర్లలో పెద్ద ఫోటోలు.

"అన్యాయంగా సాక్ష్యం చెప్పించారా మీ విరోధులు?"

"అన్యాయ మేముంది? రెండు లక్షలు కొట్టేశాను కదా! నేనే ఒప్పుకున్నానుగా."

వాళ్ళ నాలికలు చప్పున ఎండిపోయినాయి. ఎట్లా అక్కణ్ణించి లేచి పోవడం? అతను వేళాకోళం చెయ్యడం లేదు. అదంతా నిజమే!

"బైటే భోజనం చేద్దాం" అంటున్నాడు ఏ మెరగనట్టు.

ఏమిటి అక్కడ భోజనం చెయ్యడమా? విషం పెడితే? వాళ్ళచేత ఏవన్నా కాయితాలు రాయించుకుంటే! తన నిజస్వరూపం బైటపెడుతున్నాడు—ఇంక భయం లేదని. లేకపోతే ఎవడన్నా చెప్పుకుంటాడా?

బట్లరు బల్ల అమరుస్తున్నాడు. వాళ్ళిద్దరూ వొణుకుతో ఒకరి మొహాలు ఒకరు చూసుకుంటున్నారు. అతను మాట్లాడుతూనే వున్నాడు.

"నే నేమంటున్నాను? ఈ దేశ స్వాతంత్ర్య త్యాగమూర్తులకి అసలు స్వతంత్రమంటే ఎప్పుడన్నా అర్థం తెలుసునా అని! పరుల ప్రభుత్వం బానిసత్వమే. కాని మనమీద

బరువై కూచోదు. ఎవరో చెప్పిందాకా, ఆలోచించుకున్న దాకా, దానిసత్యమనిపించదు. తెల్లారి లేస్తే, పెద్దలకి, కుటుంబాలకి, ఇంటిపక్కల మనుషులకి, పురోహితుడికి, చేసే దాస్యం యెన్నడన్నా మనుషులకి తట్టిందా? నిజంగా స్వతంత్రాన్ని ప్రేమించే మనిషి దేనినించి ముందు బైటపడతాడు?"

కాని వాళ్ళు ఇక్కణ్ణించి ముందు ఎలా బైటపడటమా అని ఆలోచిస్తున్నారు.

"బ్రిటిషువాళ్ళు తెచ్చారా దరిద్రం? ఆచారాలకి, పెళ్ళిళ్ళకి, మర్యాదలకి, భేషజాలకి, దేవుళ్ళకి, ఈ సేవవల్లనేగా దరిద్రం? తిండి లేకపోలేదు అప్పు లెందుకౌతున్నాయి? ఈ వ్రతాలకి, యాత్రిలకి, మూఢత్వాలకి పైగా ఎవర్నో తిట్టడం. వాళ్ళు నిర్దోషులనను. కాని మీసంగ తేమిటి?"

అవును "మా సంగతేమిటి?" అనుకున్నారు వాళ్లు.

"అప్పులు చేసేదీ, వడ్డీలు పెరిగేదీ, దానికోసం వేలం వేసిన భూస్వామినీ, మార్వాడీని, తిట్టేది తాము ఏమీ ఎరగనట్లూ, తమ కూడు వాళ్ళు కొట్టుకుపోయినట్లు. ఇదంతా చూసే, నా కనిపించింది, ఇలాంటి మనుషుల డబ్బు ఎగేస్తే ఏం పాపంలేదని. వాళ్ళకి చేతకాదు అనుభవించడం. హాయిగా నాలుగేళ్ళు. మహావైభవం అనుభవించాను. ఎంత మందికో, నిజమైన ఆర్తులకి దానం చేశాను" అన్నాడు గర్వంగా.

3)

భోజనానికి కూచున్నారు. శాకాహారమే. కాని చాలా అందంగా వొండారు, అమర్చారు, వడ్డించారు. అతను ముందు నోట్లో పెట్టుకుంటేనేగాని వాళ్ళు తినడం లేదు. వెర్రి! ఎందుకు చంపుతాడు తమని!

ఇంట్లోంచి అతని భార్యగావును అన్నీ సర్ది పంపిస్తోంది.

ఇతని నాగరికతచూసి ఆ ముసలామెకూడా తమతో కూచుంటుం దనుకున్నారు. కాని ఆమెది పూర్వాచారం గావును!

భోజనం ఎలా చేశారో, ఏం తిన్నారో వాళ్ళకి గుర్తులేదు. వెంటనే బైలుదేరతా మన్నారు. కాని దేశికాచారి వీల్లేదని గట్టిపట్టు పట్టాడు. దాంతోనే వాళ్ళకి భయం మరీ ఎక్కువయింది. లోపలికి వెళ్ళి తన సూటూ అదీ తీసేసి బనియనూ, గూడకట్టుతో వొచ్చాడు. తాంబూలం తెప్పించాడు. వాళ్ళకి పువ్వుల దండలు యిచ్చాడు. ఆ సూటు తీసేస్తే, అతను చిన్న బొజ్జా, కొంచెం ముడతలూ, అంతా గుండ్రంగా ఓ బంతిలాగున్నాడు. కండరాలు వున్నాయా అసలు లేక అంతా అలాంటి నునుపేనా అనిపించింది.

"వరసగా సముద్రతీరమంతా ఈ చిన్న రాళ్ళవల్ల నిరంతరమైన ఆకర్షణ ఈ సముద్రానికి. కన్యాకుమారి అంత అందం లేదనుకోండి. కాని యిలా కూచుంటే ఎండలో నీళ్ళు రాళ్ళకి తగిలి పైకెగిరినప్పుడు, చాలా రంగులతో మెరుస్తుంది. ఆ తుప్పర ప్రతి దినమూ ఆ రాళ్ళని ముంచెయ్యడమూ, మళ్ళీ వొదిలి దూరంగా వెళ్ళడమూ, అదేగో

గొప్ప లీల. ఒకనాటి తీరం ఇంకోనాటిలాగుండదు. పైగా ఆనది. ఆనదిని దాటూరా, లేదా? దాటండి రేపు. ఒక్క నిమిషంలో ఏదో నిగ్గసమైన తీరానికి వెళ్ళిపోయినట్టు అవు తుంది. ఎదురుగా ఆ కొండ. ఆ కొండమీద ఆ నీటి కొల నులు చూశారా? వాటిల్లో పువ్వులు, ఈ నిర్మలాకాశం. ఇంత ఎండాకాలంలోనూ మంచు కొండలమీదనించి వొస్తు న్నట్టు చల్లని గాలి. నాముందు మెట్లమీద మర్రిచెట్టుక్రింద కూచున్నారా? ప్రొద్దున్న తొమ్మిది గంటలప్పుడు వుం టుంది—ఎక్కడో ఇటలీలో ఉన్నా మనిపిస్తుంది."

"ఇటలీ చూశారా?"

"బొమ్మలనించి...అదుగో చంద్రోదయ మవు తోంది. ఇక చూడండి. పదేసి నిమిషాలకి మారే నాట్యం అలలమీద. మీకు వోపిక వుండాలిగాని"

ఆ ఇల్లు కొండలమధ్యన వుండడంచేత దూరంగా సముద్రం వాళ్ళకి కిందగా కనపడుతోంది. కొబ్బరిచెట్ల నీడల వెనకనించి ఉదయిస్తున్నాడు బంగారు చంద్రుడు — ఎర్రని చారని సముద్రం మీద కల్పిస్తో.

"ఇంకా ఇప్పుడేకాదు తెల్లారకట్టగాని అలలమీద మెరుపు కనపడదు మనకు." అని, "లాల్" అని కేకేశాడు లోపలికి. అందమైన స్త్రీ కంఠం, రేకిమోదిగావును—అవ్యక్త మైన సితారు వాద్యంలోంచి "ఓ" అని వినపడ్డది.

"చూస్తున్నావా? చంద్రుడు"

'ఓ' అని మళ్ళీ మధురంగా గొప్ప సంతోషంలోంచి పలికినట్టు.

"ఆరి దంపతులారా! ఏం ప్రేమ మీ మధ్య ఇన్నాళ్ళ తరవాత కూడా" అనుకున్నారు. వెంటనే "ఇదో నాటకం, వీళ్ళు ఇంకా చాలా ప్రేమలో బతుకున్నట్టు! అమ్మో ఎంతకన్నా తగును వీడు" అనుకున్నారు.

తరువాత అతను వాళ్ళతో మాటలాడలేదు. సముద్రంవంక చూస్తున్నాడు, పైపు వెలిగించి నోట్లో పెట్టుకుని. వాళ్ళభయాలు సద్దుకున్నాయి వెన్నెలతో. ఎవరో వెనుక నుంచి దీపం ఆర్పేశారు. మెల్లిగా వెన్నెల గోడమీద, చెట్లనీడలోంచి, చారలుగా వాళ్ళ పాదాలముందు, వాళ్ళ వొళ్ళో వాలింది. తీగెమల్లె పరిమళాలు, వెనకనుంచి రేడియో సితారు. ముందు ఆ సముద్రంమీద వెన్నెల. వాళ్ళిద్దరూ మైమరచి పోయినారు. అదేదో లోకంలో వెళ్ళామనిపించింది. ఎంతకాలం గడిచిందో, నిద్రపోయి నారో, మేలుకున్నారో గుర్తులేకుండా ఐనారు. అతను ఒక్క వేలూ కదల్చక ఆ చైత్రమాసపు రాత్రి గాలిలో, సముద్రతీరపు శుభ్రతతో వచ్చే ఆ మెత్తని గాలిలో తన్మయుడై కూచున్నాడు. అతన్ని పలకరించడానికి బుద్ధి వెయ్యలేదు. మెల్లగా లేచి వెళ్ళిపోయినారు తోవ వెతుక్కుంటో. ఇరవై గజాలు వెళ్ళారో లేదో, అధికారంగా "ఆగండి" అన్నాడు దేశికాచారి. గుండెలు ఆగాయి వాళ్ళకి. గుబురైన చెట్లమధ్య చీకటిలోంచి సన్నని తోవ. వెనుక టార్చిలైటు వేసుకుంటో అతను చాలా కోపంగా –

"బుద్ధిలేదా మీకు! చీకట్లో వెతుకున్నారా సాహ

సించి! కొండనిండా తాచులు, పెద్ద మంత్రగబ్బలు, పదండి జాగ్రత్తగా"

ఎంత దయ, వాళ్ళక్షేమం తనకి చాలా ముఖ్య మైనట్టు! తమమీదనే కాదు, ఆ మనిషికి తోడి మానవుణ్ణి చూస్తే ఎంత వెచ్చదనం ఆ హృదయంలో ననిపించింది.

భద్రంగా వూరిమొదటిదాకా దిగబెట్టాడు.

"ఆనందం ఎంత సులభం, ఎంత సహజం. మనుషు లకి ఎందుకు వుండవో కళ్ళు" అన్నాడు దిగులుగా.

ఇంటికివెడుతో వొకటే మాటాడుకున్నారు, ఈ మనిషినించి తప్పించుకోడానికి వూరువొదిలి వెళ్ళిపోదామా అని. అంతా అనుమానమే. ముందే తమని పలకరించడం, పదే పదే స్నేహం చేసుకోడం, ఎంతో తాము కావలసిన బంధువులమల్లే, కపటప్రేమ నాటకం ఆడడం, భోజనానికి పిలవడం, ముక్కూ మొహం తెలీనిమనిషి ఎందుకు చేస్తాడు ఇదంతా? ఎప్పుడో అనంతపురం వొచ్చి వీళ్ళని ఉపయో గించుకుని డబ్బు పోగుచేసుకోడానికేమో! అలా ఐతే తాను జైలుదొంగని ఎందుకు చెప్పుకుంటాడు? ఎలానూ వినే వుంటారు కదా అనా? తనే చెప్పుకుంటే నమ్మకం కలుగు తుందనా! ఈ వూరివాళ్ళకి తెలుసా అతనిసంగతి! కాని బీచిమీద కొత్తవాళ్ళకి?

మర్నాడు జాగ్రత్తగా అడిగి చూశారు, దేశికా చారి దొంగ చరిత్ర సంగతి. కొంతమందికి బాగా తెలుసు. కొంతమంది ఏదో విన్నారు, కొంతమందికి ఏమీ తెలీదు,

కాని అంతమందికీ కూడా చాలా ప్రేమా, గౌరవం అతన్ని చూస్తే. ఎవరికి ఏ అన్యాయం చెయ్యడు సరేకదా, ఎక్కడెక్కడ తాను ఏ చిన్న ఉపకారం చెయ్యడానికి వీలున్నా అక్కడ హాజరౌతాడు. చందాలు, మనిషి సహాయం పోగు చేస్తాడు. ఎవరిజోలీ, ఎవరిసంగతీ, ఊరి వ్యవహారాలూ, అపవాదులతో అతనికేం పని లేదు.

అతనిలో ఇంతమార్పు ఎలా వొచ్చిందా? అని ఆశ్చర్యపడ్డారు. గడిచిన రాత్రి భయాలకి సిగ్గుపడ్డారు. అతను తను చేసిన పాపాలకి పరిహారం చేసుకొంటున్నాడు కాబోలు. తెలుగువాళ్ళు అంతే. వాళ్ళకి మనిషి నచ్చితేసరి. ఆ మనిషి ఎటువంటివాడు, ఏం ఘోరకృత్యాలు చేశాడు అనేది వాళ్ళ కంతగా పట్టదు. ఎవరన్నా ఎత్తినా 'బలేవాడు' అని నవ్వేస్తారు.

దేశికాచారి వాళ్ళకి విప్పి తెలియ చేసింతరువాత, భీమ్లీలో అపూర్వమైన అందం కనపడుతోంది వాళ్ళకి. మర్నాడు సాయంత్రం భీమ్లీ చరిత్ర చెప్పాడు. ఏ విధంగా మొదట యూరపు జాతులకి ఈ భీమ్లీ కనపడివుంటుందో, శిథిలమైన వాళ్ళ కట్టడాల చిహ్నాలు ఎక్కడెక్కడ ఉన్నాయో, వాళ్ళ గోరీలమీద సంగతులు చదివితే, ఎన్ని విషాద, సంతోష చరిత్రలు కనపడతాయో వివరించాడు. పూర్వం నుంచి రేవుపట్టణం కావడం, కొత్త దేశాల ఓడలు కొత్తదేశస్థులతో, సామాన్లతో రావడం, ఆ కొత్తదనం అన్నీ వాళ్ళ కళ్ళయెదుట నిలిపాడు. వాళ్ళు భీమ్లీలో ప్రతి

సందూ, ప్రతి చిన్న అరుగూ, యేదో గ్రంథమైనట్టు చూసో తిరుగుతున్నారు.

రెండోరోజు సాయంత్రం సముద్ర స్నానం చేశారు ఓ కొండరాయిమీద కూచుని. ఎత్తుగావచ్చే అలలలో మునుగుతో ఆడుకున్నారు. అయ్యారుదగ్గిర భోజనంచేసి సత్రానికి వెళ్ళారు. సత్రంలో మూడు రోజులే ఉండనిస్తారు. కాని దేశికాచారి ఎవరితో మాటాడాడో యెంతకాలమైనా వుండనిస్తా మన్నారు వాళ్ళని.

ఆ రాత్రి లక్ష్మణసింగుకి చెవిపోటు వచ్చింది. సముద్రపు కెరటం దెబ్బవల్ల నేమో! పరవాలేదని పడుకొంటే రాత్రి పదకొండు గంటలకి నిలవలేని బాధతో మూలుగుతున్నాడు. ఏం చేస్తారు ఆ అర్ధరాత్రి! సత్రం మనిషి లేడు కూడాను. దేశికాచారే దిక్కు! అతన్ని ఈ అరరాత్రి లేపడమా? కాని తప్పదు. ఏ డాక్టరు దగ్గిరకన్నా తీసికెడతాడు. బైట వెన్నెల చారపడ్డది. చంద్రోదయం మిన్‌కాడు. మేలుకునే వుండవొచ్చు. టార్చిలైటు తీసుకుని బైలుదేరాడు నరసింహారావు. తోవ సరిగా తెలియదు. ఏ రోడ్డునించి తిరిగినా మలుపులో ఎదురుగా పొంగుతో ఉదయించే చందురిడితో సరసాలాడుతో సముద్రం ఎదురు గోడమీద వెన్నెలలో రెండోవేపు పురాతన గోడలకింద కరిగిపోయే నీడలు. ఆ అందం నరసింహారావుకి భరించలే ననిపించింది. అనంతపురంలో ఇక్కడికన్నా స్వచ్ఛం ఆకాశం. ఆ ఊరు చుట్టూ కొండలు యెంతో అందమంటారు. ప్రతి సూర్యోదయం, అస్తమానం, అమ్మవారికి పసుపు కుంకుమ పూజ

ల్లాగు వుండేవి. నక్షత్రాలు, చంద్రుడూ తలలకి యెంతో దగ్గిరగా వెలుగుతున్నట్టు కనబడేవి. కాని వాటినన్నిటినీ ఓ గొప్ప అందంగా చూసుకోలేదు వాళ్ళు! భీమ్లీలో యింత అందం కనపడడానికి దేశికాచారి యిచ్చిన దృష్టే కారణం.

పల్లెవాళ్ళ యిళ్ళని దాటి, కొండవేపు తిరిగాడు. దోవ చుట్టు తిరిగానని అనిపించింది. రోడ్డంతా ఒకే వెన్నెల చార. పక్కన చెట్ల నీడలు. ఎత్తుని ఎక్కుతో మాటిమాటికీ వెనక్కితిరిగి సముద్రంవంక చూస్తో నడవాలనే. కాని దేశికా చారి పాముల భయం పెట్టాడు. అతని బంగళా కనపడ్డది. సన్నతోవలోంచి జాగ్రత్తగా వెళ్ళాడు. బైటకూచుని వున్నాడా? సంపెంగపొద వెనుకనించి మలుపు తిరిగాడు, పొద నీడలోకి. వరండాలోకి సూటిగా వెన్నెల పడుతోంది. వరండాచివర తివాసీమీద స్తంభాన్నానుకుని కూచుని వున్నాడు దేశికాచారి సముద్రంవంక చూస్తో. అతని రొమ్ము మీద తలపెట్టుకుని, అతని బుజంచుట్టూ చెయ్యేసి, వెన్నెలతో మెరుస్తున్న అతని గుండ్రని మొహంవంక చూస్తో వెల్లకిలా పడుకుని వుంది అతని భార్య. 'అరి, వీళ్ళ తస్సాగొయ్యా!' అనిపించింది. కాని వాళ్ళిద్దరి అన్యోన్యం ఇన్నేళ్ళకీ విడని మమత, అలా వెన్నెట్లో ఏకమై నిశ్శబ్దంగా నిలపగల వాళ్ళ మనోస్థితి! ఇన్ని సంవత్సరాలు ఏం అనుభవించారో! శరీరాలతో సరే. అసలు ఒకరిపైని ఒకరిదృష్టి, ప్రాముఖ్యత, అందంలో ఐక్యం! అతను జైలులో ఉన్నప్పుడు ఏమయిందో ఈమె? కాని అంత దుశ్శీలుడు అతను. ఆమే అంతేనా! లేక పతివ్రతా!

ఒక్కనిమిషంలో ఇన్ని ఆలోచనలు తిరిగాయి అతని మనసులో. అడుగు వెనక్కివేసి పొదచాటుకి వెళ్లాడు. ఎలా వాళ్ళని డిస్టర్బు చెయ్యడం? వెనక్కి వెళ్ళిపోతే! కాని మిత్రుడి చెవిపోటు! తప్పదు.

"దేశికాచారిగారూ !"

అన్నాడుగాని, చోకతాయ్ చిత్రంలో మనిషిని బైటికి పిలిచినట్టనిపించింది. అంత సాక్రిలైజ్.

"కమ్ యిన్ ప్లీస్" అన్నాడు,

ఎవరో పిలిచింది తెలియకండానే. భయమన్నా లేదు వాళ్ళకి ఈ అడవిలో!

నెమ్మదిగా వెళ్ళాడు. ఆ లోపలే ఆమె లేచింది. అతను దరికి వెళ్ళేప్పటికి కుర్చీలో కూచుంటోంది.

"మీరా? ఏమిటి ఈ అర్ధరాత్రి! ఏమిటి!" అని ఆదుర్దాగా ప్రశ్నించాడు. చెప్పాడు అతను.

"మందిస్తాను. తగ్గిపోతుంది" అని లోపలికి వెళ్ళాడు.

ఆమె మాటాడకుండా, తోటలోకి చూస్తోంది.

ఆమె యవ్వనవతి. పాతికేళ్లు వుంటాయో; లేదో!

యెవరామె? అతనికి రెండో పెళ్ళా? ఆమె అందమయింది. యెంత అందమో ఆ సగం వెన్నెల్లో తెలీటం లేదు. ఆమె బట్టలుకూడా సరిగా వేసుకోలేదు. ఒక చీరో ఏదో కట్టుకుందో, కప్పుకుందో. చాలా పల్చగా వుంది. ఆ తోటా, ఆ అర్ధరాత్రి, నిశ్చలంగా తను లేనట్టే

కూచున్న ఆమె ఎంతో అందంగా వుంది. ఏదో మిస్టరీ ఆమె చుట్టూ.

ఇంతలో దేశికాచారి హోమియోపతి మాత్ర లిచ్చాడు తెచ్చి.

"పాపం, పరదేశం, మీ కెవరూ తెలీదు" అంటో వీపుమీద చెయ్యేసి కొంచెం దూరం పంపించాడు.

"కూచుని సముద్రం చూడమందును. కాని మీ మిత్రుడు బాధపడుతో వుంటాడు. వెళ్ళండి. నాతో చెప్పకండా యెందుకు స్నానం చేశారు? సముద్రంలో స్నానం యెట్లా చెయ్యాలో నేను చెప్పనా!" అన్నాడు.

"ఆమెని పరిచయం చెయ్యడేం?" అనుకున్నాడు. ఆమెతో ఒక్క మాటన్నా మాటాడితే తన కేదో గొప్ప వరం అనిపించింది అతనికి.

ఇట్లా అనుకుంటో వెన్నెల్లో వొక్కడూ కొండ దిగి సత్రంవేపు వెళ్ళిపోయినాడు.

సాయంత్రం పడమటి కొండల వెనకనించి భూతాల మల్లే బైలుదేరాయి, నల్లని బరువు మబ్బులు. ఆరింటికే సముద్రమంతా చీకటి అయింది. పైగా అలల వెనకనించి పెద్ద గాలి నీటిని రేపి ముందుకు తోస్తోంది. ఊరికి మైలున్నర దూరంలో సముద్రం పడమటివేపుకి వొంపు తిరిగిన చోట యెత్తయిన యిసిక దిబ్బమీద కూచున్నారు మిత్రులిద్దరూ. రాత్రి తాను చూచిన దృశ్యాన్ని సింగుకి చెప్పిం తరువాత దేశికాచారిని ఆ సాయంత్రం కలుసుకోడం సిగ్గూ,

కొంచెం భయంకూడా వేసి వొచ్చేశాడు. సముద్రంవంక చూడడమే నయంగావుంది. నీళ్ళు ముందుకు తోసుకుని, విరిగి పడుతున్నాయి. చప్పున లేచి వెనక్కి వూరువేపు నడుస్తున్నారు, సముద్రంవొడ్డునే. రెండు నిమిషాలు నడిచారో లేదో పెద్ద మొగలిపొద అడ్డం వొచ్చింది. ఇదేమిటి? బీచివొడ్డుకి ఓ పొదా? పొద ఎట్లా నడిచివొచ్చింది? చీకటి, యెట్లా వెళ్ళడం? నీళ్ళలో జిగాలి. ఈడ్చి కొడుతున్న ఆ అలలలోకి—కరుకు మొనలుతేలిన ఆ రాళ్ళల్లో! భయంవేసింది. ఏదో ఇంద్రజాలం — వొచ్చేప్పుడు లేని పెద్ద చెట్టు ఇప్పుడెట్లా మొలిచింది? ఆ పొదవెనక ఇంకా పొదలు. ఆ పొదలు మొదలుని కావిలించుకుని ఈడుస్తున్నాయి అలలు. నరసింహారావు వొణుకుతున్నాడు. చప్పున లక్ష్మణసింగు బిగ్గరగా నవ్వాడు. "ఏం లేదోయి. మరి నీళ్ళు ముందుకి పొంగలేదూ? ఈ పొదదాకా పొంగాయి."

క్రింద పడిపోవటానికి తయారుగావున్న మిత్రుణ్ణి పట్టుకుని, టార్చిలయినా తీసుకోని బుద్ధితక్కువని తిట్టుకుని, చెప్పులతో సహా తనుస్తో సముద్రంలోకి దిగాడు. నాలుగు అడుగులు వేశారో లేదో, అడ్డంగా పెద్ద కొండరాయి. జారుడు, దానికి తగులుతో ఓ పొద ఒకవేపు. రెండో వేపు తిరిగి వెడదామంటే యెంత లోతో సముద్రం? నిలబడిపోయినారు. యెంతసేపో! కాని చాలా కొంచెం సేపే. చిన్న ఉరుం. ఇందాక మెరిసింది. మళ్ళీ మెరవకూడదా?

ఎవరో నవ్వుతున్నారు! ఆ యీదురుగాలిలో, సముద్రం హోరులో.

“బాబో!” అని అరిచాడు సింగు.

బిగ్గరిగా ఏడుస్తో అరిచాడు నరసింహారావు. సముద్రంలో పడి చచ్చిపోవడం మంచిదనిపించింది వాళ్ళకి. ఏం వూరు ఇది? ఎందుకొచ్చారు?

చల్లదనం వాంఛించి?

“నిరాశ ఇటులవచ్చితి, భయంబెట్లోకదే ఈశ్వరా” అనుకున్నారు గావును.

ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు.

“ఎవరు?” అన్నారు స్త్రీ కంఠంతో.

“ఆ. ఆ. ఎవరుతల్లీ మీరు?” అన్నాడు సింగ్ వొణికే కంఠంతో.

“ఏమిటి, దాటలేరా?”

ఆ కొండరాయి మీదనించి. వాళ్ళ నెత్తిమీద.

“ఊఁ”

“వొస్తాను. వుండండి. భయంలేదు.”

దిగుతోంది ఆమె ఎవరో! ఆ రాయిమీదినించి.

మెరిసింది.

ఒక యువతి తెల్లటి వొళ్ళు. తెలుగు ఎంత స్వచ్ఛంగా వొచ్చో?

దిగి చెయ్యి అందిచ్చింది.

కొండ పక్కగా తీసికెళ్ళింది, ఆ ప్రదేశమంతా

తనకి బాగా, స్పష్టంగా తెలిసిన రాజ్యమైనట్టు. బతికాము జీవుడా అని తొరతొరగా నడక ప్రారంభించారు, 'థ్యాంక్సు' అన్నా చెప్పకండా.

"మరి ఆమె ఆ చీకట్లో వొంటరిగా?" అన్నాడు సింగ్.

"పోనిద్దూ. ఇంకా ఎవరో వుంటారులెద్దూ."

"కాదు. పాపం, కనుక్కుని మరీ వెడదాం."

"ఈ చీకట్లో ఎట్లా కనబడుతుందోయ్!"

"కేకేద్దాం?"

"సరే అరు. కాని నేను వెనక్కిమాత్రం రాను."

"ఏమండీ, ఏమండీ."

జవాబు పెద్ద నవ్వు.

ఆ నవ్వుకి నరసింహారావు పరుగుతీశాడు.

"వొస్తున్నాను. మళ్ళీ ఏమొచ్చింది?"

దగ్గిరిగా వొచ్చింది.

"ఏం లేదు. మీరు ఇక్కడ వొంటరిగా...."

"అదా, ఏం...?"

మళ్లీ, మెరిసింది, చాలా వివరంగా లోకం కనపడుతో.

ఆమె కనపడింది.

"ఏం పరవాలేదు. వెళ్ళండి."

అంటో వెనకాలకి తిరిగి వెళ్ళిపోయింది. అంధకారం.

లక్ష్మణసింగ్ అట్లానే నిలిచిపోయినాడు, నరసింహారావు రమ్మన్న కేకలు వినపడ్డదాకా.

"ఏమిటి రావేం?"

"ఉండు. ఆమెని సరిగా చూశావా?"

"ముందు రా! తరువాత సముద్రం అందాన్ని, ఆడ వాళ్ళ అందాన్ని చూడవొచ్చు."

"చూశావా?" అన్నాడు నడుస్తో.

"లేదు. ఇప్పుడు చూడడమేనా ముఖ్యం? పద. వానకూడా వొచ్చేట్టుంది. బతికి బయటపడ్డాం. అది చాలు. చాలా చూడవొచ్చు రేపణ్ణించి."

"నాకు వెనకాలకి వెళ్ళాలనిపిస్తోంది."

"ఈసారి, చెప్పుతీసుకు తంతుంది. సరిపోతుంది. పాపం. మన ప్రాణాలు రక్షించింది. చాలదూ? పద. పైగా పోయి – సరిగా బట్టలన్నా లేవు ఆమెకి ... ఏం చేస్తోందో వొంటరిగా! భయంలేదు. ఎట్లాంటి ఆడవాళ్ళుంటారో? ఎవరో ఇంగ్లీషామె."

"కాదు లాలస లాగుంది."

"లాలస? లాలస ఎవరు?"

"అవును. నీ కెట్లా తెలుస్తుంది?"

"ఎవరు?"

"ఎవరోలే, నే నెరుగుదును ఒకప్పుడు."

"ఎక్కడ?"

"మన వూళ్ళోనే"
"మన వూళ్ళోనా? హో! ఎవరు?"
"నీకు తెలీదులే. ఇంతకీ అవునో కాదో?"

తరువాత పరధ్యానంగా కొంచెం జవాబు చెప్పాడు. సింగు ధ్యానమంతా తన పాత జీవితంమీద.

నాలుగు ఏళ్ళకిందట ఆ చివరి వుత్తరం వొచ్చింది లాలసనించి. తాను చాలా దరిద్రంలో, కష్టంలో వున్నానని, రమ్మంటే వొచ్చి అతనిదగ్గిర వుంటాననీ. కాని చేసిందానికి పశ్చాత్తాపమూ లేదు. అతన్ని ఎటువంటి ఘోరమైన విరహంలో, కసిలో, అవమానంలో వొదిలి వెళ్ళిందో ఆ సంగతికి దిగులూ లేదు. పోనీ ముందైనా సరిగా వుంటాననిగాని, వుండడానికి ప్రయత్నం చేస్తానని గాని సూచనా లేదు.

ఆమెని తలుచుకుని; ఆమె తనతో ప్రేమగా వున్న రోజుల వెలుగు తలుచుకుని వూగాడు. కాని వూరంతా ఏమంటారు? తను మొహం ఎట్లా చూపుతాడు? తన తమ్ములూ, తల్లీ ఒప్పుకుంటారా? అదిగాక తనని ఆమె నిర్దయగా చేసిన మోసం? ఒక్క ఆరు నెలలలో తాను పదేళ్ళ వయసు గడిచినట్లు కావడం తెలుచుకొని జవాబు రాయలేదు. మళ్లీ ఒక్క ముక్క రాసింది. "ఇంతేనా, ఇంక మీ ఆశ నాకు లేనట్టేనా?" అని. దాంతో సరి.

ఆ లాలస ఈ వూరు వొచ్చిందా? ఎక్కడ వుంది? ఏం చేస్తోంది? ఈ రాత్రి తనకి ప్రాణదానం చేసింది

లాలసేనా? మళ్ళీ కనబడుతుందా? ఇన్నాళ్ళు కనబడ లేదేం? తనని గుర్తుపట్టిందా? లాలసే ఐతే తనని గుర్తు పట్టి వుండదా? కాదు.

ఆమె లాలసే అయితే తాను భీమ్లీ వెంటనే విడిచి పోవడం మంచిది. ఆమెని కలుసుకోలేడు. భీమ్లీ నరక ప్రాయ మౌతుంది. కాని లాలస కాదు. తనకేం భయం లేదు.

హోటలుకి చేరుకునేప్పటికే తడిశారు ఇద్దరూ. ఆమె యెవరని అనుగుదా మనుకున్నారుగాని తాము పడ్డభయం, ఆడది రక్షించింది అని చెప్పుకోడం సిగ్గయి వూరుకున్నారు. పెద్ద వానలో, గాలిలో తమ గది చేరుకున్నారు. ఇంకా ఆ వూళ్ళో వుంటే ఆ సత్రం వొదిలి ఇల్లు చూసుకోవాలి. బట్టలు మార్చుకొని కబుర్లు చెప్పుకుంటో కూచున్నారు. సింగ్ మాట్లాడక పోవడం చూసి నరసింహారావు చదువు కుంటున్నాడు. సింగ్ మనసుని లాలస జ్ఞాపకాలు గట్టిగా ఆవరించాయి.

అట్లాంటి పెద్దవర్షంలోనే రాత్రి వెళ్ళిపోయింది లాలస. అంతకుముందు చాలా వారాలనుంచి ఘోరమైన పోట్లాట వాళ్ళిద్దరికీ. ఆమె మొదటినుంచి వెళ్ళిపోతాననే అంటోంది. తాను అడ్డపడ్డాడు. ఎట్లాగో సరిపెట్టుకొందా మనుకున్నాడు. కాని తన తమ్ముళ్లూ, మరదళ్ళూ గోలచేశారు. ఇంట్లో నిలవడం ఇబ్బందయింది. లాలస తప్పేముంది? మొదట పెళ్ళి చేసుకొనేప్పుడే "సగే చూద్దాం కానీ" అంది.

స్త్రీలకి యీ చదువులవల్లా, స్వేచ్ఛవల్లా కాపరాలిట్లా అవుతున్నాయి. మరి వాళ్ళు మనుషులేగా అంటే, అవును చదువులూ, స్వేచ్ఛా వుండవలసిందే. ఉద్యోగాలు చెయ్యవలసిందే. కాని ఆ స్త్రీలు వేరు. వాళ్ళు పెళ్ళిళ్లు చేసుకోగూడదు. పెళ్ళి అనగానే కొంతవరకన్నా బంధాలు, బాధ్యతలూ అంగీకరించాలి. కాకపోతే ఇంక పెళ్లి అనే దానికి అర్థం ఏముంది?

ఆ మూల్యాంకర్ వల్లవచ్చింది ఈ గ్రహచారం. అతను రాకండావుంటే ఏమో! ఇంకోడు వచ్చేవాడు. వొచ్చినా లాలస అట్లా వూగిపొయ్యేదికాదు. అతనే కారణం. మనిషి మళ్లీ ఏం బావుండడు. అంతా రబ్బరువొళ్ళు. వెన్నముద్ద. మరి అదేం ఆకర్షణో! అతని వొళ్ళూ, అతని స్వభావమూ, కాక అతనిలోని కళా! ఈ ఆర్టిస్టుల్ని కాపరాలలోకి రానిడమే బుద్ధితక్కువ. వాళ్లు అందరిమల్లే పెళ్ళిళ్ళు చేసుకోరు. పెళ్ళాలు వున్నా లేనట్టే తిరుగుతారు తోకచుక్కలమల్లే వచ్చి పడతారు వూళ్ళమీద. ఆకళ్లేవో వాళ్ల వూళ్ళల్లోనే సాధించుకోకూడదూ! ఆర్టిస్టుకాగానే ప్రచారం ప్రారంభిస్తాడు. అదేదో ఆ కళ చూపి డబ్బు పోగుచేసుకొని పోరు. ఇళ్ళల్లో చేరతారు. వాళ్ళు మెట్టిన ప్రదేశమంతా ఎడారిచేసి మరీ పోతారు వీళ్ళని అరికట్టటానికి ఏ చట్టాలూ చెయ్యలేదు ప్రభుత్వం.

ఆ మూల్యాంకర్ ఏ వాయిద్యాన్నన్నా అద్భుతంగా మోయిస్తాడు. ఏవేవో దూరపు ప్రదేశాల మనుషుల

అందాలు చాలా ఆకర్షణీయంగా మాటలాడతాడు. వైద్యం చేస్తాడు. ఈ లోకానికి చెందని అందాల కలలు కనిపిస్తాడు. మరి అతని పక్కలో ఏమేమో అనుభవించగలనున్న ఆశల్ని రేపుతాడు గావును ఆడవాళ్ళ హృదయాల్లో. ఆడవాళ్ళేమిటి? తా నేమైపోయినాడు? అతను వుంటే లోకమే ఒక పెద్ద నవ్వుగా, అందంగా కనబడ్డది. మామూలుతనం సులభంగా తీసేశాడు జీవితంమీదనుంచి. తన తమ్ముళ్లు తొరలోనే మేలుకొని, వాణ్ణి వరకుతా మన్నారు. లాలసమీంది గౌరవంవల్ల, ప్రేమవల్ల తను అడ్డపడకపోతే ఏం ఘోరాలు జరిగేవో !

మాల్వంకర్ రాకముందు రెండు సంవత్సరాలు ఎంత అందంగా గడిచాయి! లాలస తనభార్యఅయి తనతో వుండడం ఎంత గొప్ప గర్వం! తనకి వాంఛించవలసింది ఏమీ కనపళ్లేదు. కోర్టులో తనమాటే, నడకే, గొప్ప బలంగా, ఉత్సాహంగా, తేజోవంతంగా వుండేది. ఎంత చీదరలోనూ, కేసు ఓడిపోయేప్పుడుకూడా ఇంటికి వెడితే లాలస తనకోసంచూస్తో, కణతలదాకా పాకే సంతోషంతో, పెదిమల చివర తనకోసం కోర్కెతో, తన కెదురుగా రావడం, ఆమె మెడచుట్టూ చెయ్యేసి తాము తమ గది లోకి వెళ్ళడం, తను టీ తాగుతూవుంటే యెదురుగా కూచోడం, సాయంత్రపు యెండలో ఆమెని తన తొడ మీద కూచోబెట్టుకోడం—కాని తను నిజంగా, తృప్తిగా సంతోషంగా వున్నాడా? మొదటినుంచీ తనకి లోపల భయమే, అనుమానమే. ఇంటికి వొచ్చిన నాలుగు రోజు

ల్లోనే తన తమ్ముళ్లు తన భార్యల్ని వొదిలి "వొదినా!" అంటూ ఆమె కొంగువెంట తిరిగారు. తమ ఇద్దరికీ వొంటరిగా వుండడానికే సమయం చిక్కేదికాదు. ఆ ఆకర్షణకి తనకి గర్వమే! కాని భయం. అందర్నీ ఆకర్షిస్తే తనకేంలాభం? ఇబ్బందే. కాని ఆకర్షణా, గ్రేస్, లావణ్యం ఇవన్నీ కావాలికద! అవేకద తనని మూడేళ్ళు ఆమె చుట్టూ తిప్పింది! ఆ కాలంలో కాలేజి కుర్రాళ్ళల్లో తననే ఏరుకోవాలనీ, తీరా తన భార్య అయింతరువాత ఈ గొడవ! కాని అదంతా తాను ఉదారంగానే తీసుకున్నాడు. ఆమె నవ్వులు తనమీదనే ప్రసరించాలనడం ఎంత సంకుచితం? తక్కిన మొగవాళ్లతో మాటలాడకూడదా? మొహం మూర్చుకోవాలా? లాలస తన మరదులతో గంతులెయ్యడం, వేళాకోళాలు, ప్రాక్టికల్ జోక్సు, అన్నీ తనకి కోపం తెప్పించేవి. కాని ఏమంటాడు! మొద్దుమల్లే ఆమె ఓమూల కూచోవాలనా? ఆమె తనదీ. తనది అంటే, రాత్రులు వొంటినంతా తనకి ఇయ్యడం. ఆ మాత్రమే అయితే తానేదో ఆమెవల్ల మోసంలోపడ్డాననిపించేది. కాని ఎక్కడవుందో మోసం! ఆమెని ఏం తప్పో తెలిసేదికాదు. తనకి ఆనాడూ లేదు, ఈ నాడు లేదు అనుమానం. లాలస హద్దుతప్పి, యెవరితోనన్నా వున్నదంటే హద్దుతప్పినరోజున స్పష్టంగానే తప్పింది. కాని అంతవరకు తన బాధ యెంత అన్యాయమని తనని తాను నిందించుకున్నా లాభం లేకపోయింది. ఆ తమ్ముళ్లకి ఇంకేం పనిలేదా, తన భార్యవెంట పడడం తప్ప! అదంతా 'లాలస' తనదనీ, తన స్వంతమనే

భావంవల్ల వొచ్చిన కష్టం. మరి తన భార్య తన స్వంతం కాదా? అయితే ఆ నవ్వులనీ, ఆటల్నీ, పాటల్నీ, అందరికీ ఇచ్చి తనకి రాత్రులు ఆ కాసేపు వొళ్ళు ఇచ్చుకుంటే! మరి వాళ్ళల్లో అట్టే తేడాలుండవు. ఆ నవ్వులూ. చమత్కారాలు, ఆ చక్కనికళ్ళు మెరవడం, మెడని అందంగా వెనక్కి చాచి కులకడం, మృదువుగా పువ్వులమల్లే మాటలూ, ఇవేగా భేదం! అవి అందరికీనా, తాను ఆ కథల్లో, పరియాచకాలలో కలవలేక పోయేవాడు. తాను భర్త. తన స్వంతం. అందరితో కలిసి ఆమెని పంచుకో లేడు. రాత్రులు వొంటరిగా ఆమె తన బుజాన్ని ఆనుకొని నిశ్శబ్దంగా కిటికీలోంచి చెరువుమీద వెన్నెలవంక చూసే ప్పుడు కూడా అతనికి సంతుష్టి వుండేదికాదు. మామూలు భార్యఐతే, 'ఏమిటా అల్లరి!' అని ఓసారి గద్దిస్తే చాలు. కాని ఈ చదువుకున్న ఆడవాళ్ళు వూరుకోరు.

"ఏం అల్లరి?"

"అల్లరి అంటే ఏమిటి?"

"అల్లరి చేస్తేనేం?"

"నువ్వు లేనప్పుడు కూడా, యెవరితో మాటలాడకుండా, యెవరన్నా కలుకరించినా మెదలకుండా కూచో మంటావా? యెందుకు కూచోవాలి?"

అట్లా ప్రశ్నలడిగి, వెర్రివెధవని చేస్తారు మొగవాణ్ణి. చాలా అన్యాయం కాపురాలిట్లా కావడం. మొగవాళ్ళకి చాలా అన్యాయం జరుగుతోంది.

స్త్రీని భర్త అయినా తనదీ అనుకోవడం తప్పని వాదిస్తాడు మాల్వంకర్. ప్రాణంలేని ఆస్తులే యెవరివి? అనే ప్రశ్న లొచ్చిన రోజుల్లో, ఇంకా ప్రాణంవున్న ఇంకో మనిషిని 'నాదీ' అనుకోడం ఘోరంఅంటాడు. నిజమే. కాని అందరూ ఇంకా తమ భార్యలతో హాయిగా వుండగా, తాను వొక్కడేనా, తన భార్యని, అందరిదీ అనుకోడం! మాల్వంకరికి భార్య లేదుట. ఉంటే తనదీ అనుకోడా? అనుకోనన్నాడు. ప్రేమ లేకపోయినా, భార్యని, అందరిదీ అనుకోలేరుకదా ? లాలసని తాను అనుకోగలడా ?

అసలు 'తనదీ' అనుకోందే దానిమీద ప్రేమ వస్తుందా ? వొస్తుందంటారు పుస్తకాల్లో ! ఇతర్ల భార్యల మీద ప్రేమ రాదా మరి ? తమది అనుకోకండానే పెళ్ళి కాకముందు మూడేళ్ళు ప్రేమించలేదా తను లాలసని ! కాదు, అది ప్రేమకాదు. వాంఛ. తనది కావాలని. తనది అయింతరువాతనే, తనది అనుకొన్నంతకాలమే ప్రేమ. తనది కానినాడు మళ్ళీ వాంఛ, విరహం, జెలసీ, ఇంకా ఎన్నో! ప్రేమకాదు. మరి వివాహంలేని సంఘం చాలాఆరోగ్యంగా, ఆనందంగా వుంటుందని కలలు కంటాడు చలం. తన సొంతం అనే భావన వదిలిపోవాలంటాడు. మరి అది అతని వుత్తవాదనో, 'థియరీ'యో, లేక అతని అనుభవమో! కాపరాల్లోని చిక్కులుతీర్చే విధం కనపడక, ఆ పిచ్చి థియరీని కల్పించాడేమో ! ఎంత యోచించినా, తన స్వంతం అనుకోకుండా ప్రేమించడమనేది దూరంగానన్నా యోచించుకోలేక పోయినాడు తాను. మరి పెళ్ళి అనేది

పోయిననాడు మనుషులే మారతారా? ఉన్నతులౌతారా? కాక, ఇంక ప్రేమ లేకుండా, వూరికే తాత్కాలికంగా కామం తీర్చుకుంటారా? ఎవరికి ఎవరూ సొంతం కాకుండా, వూరికే మాట్లాడమేగాని, అట్లా ఎప్పటికీ జరుగదు. ఆ రాసేవాళ్లే వొప్పుకోరు, అట్లాంటిది వాళ్ళకే జరిగితే. మరి మొగవాళ్ళో అంటారు. మొగవాళ్ళు ఇంకో ఆడవాళ్ళని మోహించినా, భార్య కెప్పుడూ భర్త తను స్వంతమే అని వుంటుంది. కావలిస్తే భర్తలకి కూడా ఆ స్వతంత్రం తీసెయ్యవొచ్చు.

నాటకానికి వెడితే లాలస చూపుకోసం కాచుకున్నట్లు వుండేవి ప్రేక్షకుల కళ్ళు. ఆమెలోనే వుంది ఆ గుణం. చూసిందా, ఏవో ఆశల్ని రేపుతున్నట్లు తప్ప చూడలేదు. మాట్లాడిందా, ఆ ఎదుటమనిషిని యెంతో దగ్గిరగా తీసుకొని, అతనితో మాట్లాడడం తనకి చాలా ఇష్టమన్నట్టు మాట్లాడుతుంది. దీనికి పడి చచ్చిపోతారు మనుషులు.

అట్లాంటి లాలస తనకి లేదు. తనకా యోగ్యత, అదృష్టం లేకపోయినాయి. కాని తనేం చేశాడు?

ఆమె బుజాలకి స్నానమైనాక చీర వదులుగా చుట్టుకొని అద్దం ముందు జుట్టుని సర్దుకుంటోవుంటే, తను వెనుక నిలబడి అద్దంలో ఆమె రొమ్ముల్లోకీ, ఉబికే బుజాలకింద లోతుల్నీ, వెనుక వీపులోకి జారే వొంపుల్ని చూస్తో, ఒక్కసారి నవ్వుతో బెట్టుచేస్తున్న ఆమెని అమాంతం మంచందాకి యెత్తుకుపొయ్యేవాడు.

ఈనాడు మళ్ళీ లాలస కనబడితే!

ఇక్కడ ఏం చేస్తోంది? మాల్వంకర్ మళ్ళీ వొచ్చాడా? ఆమెని మూడు నెలల్లోనే వొదిలేశాడుగా! కాని ఆమే అతన్ని వొదిలిందా? మళ్ళీ కలుసుకున్నారా? బొంబే నుంచి ఢిల్లీ వొచ్చారా? డబ్బా? మాల్వంకర్‌కి డబ్బు వుంటుందా? కాని ఆమెని వొదిలి బతకగలడా మాల్వంకర్! ఈ నాలుగేళ్లూ ఆమెని, ఆమె నవ్వుని, వెలుగునీ, అందాన్ని, ఆకాశం తనలోకి లాక్కుని ప్రకాశిస్తోంది అనిపించింది అతనికి. ఢిల్లీకి ఆమెవల్లనేమో అంత అందం!

ఆరాత్రి తనువొచ్చేటప్పటికి మాల్వంకర్, ఆమెరొమ్ముల మధ్య అతనితల అతని తలచుట్టూ ఆమె చేతులు. ఆ దృశ్యం తరువాతనేకదా తనకి ఆశ లేదనిపించింది! ఏదో ఓసారి యెవరినో అనుభవించిందంటే, అంత బాధగా వుండదు. మరిచిపోవచ్చు. కాని అట్లా ఇంకో పురుషుణ్ణి స్త్రీ తీసుకుందంటే... ఏముంది ఆ మాల్వంకర్‌లో!

ఆమె దీనంగా తనకిరాస్తే, తాను మౌనంగా వూరుకోవడం చాలా కఠినం. పాపం! ఎంత అవస్థలో పడిపోయిందో! ఆ పిచ్చి వదలగానే తనతో మునుపటిమల్లేనే వుండేదేమో! కాని తను చూసిన జ్ఞాపకాలు, తను చూడని వాటి అనుభవాలూ; భరించలేకపోయినాడు.

కిటికీలోంచి వానజల్లు మీద పడుతోంది. నరసింహారావు నిద్రపోయినాడు. ఆ రాత్రికింక లాలస మరుపురాదా! పోనీ, ఈ వర్షంలో తోవతప్పి సత్రానికి రాకూడదా

లాలస ! మళ్ళీ కనబడితే ఏమంటాడు తాను ? మళ్ళీ తీసుకుంటాడా ?

ఆ మాల్వాంకర్ వల్ల లాలస తననించి బెదిరిపోయిందా, లేక లాలస స్వభావమే అంతా ? అవును. అట్లాంటి స్త్రీలు అంతే. నిలకడ వుండదు వాళ్ళ రక్తంలోనే. ఇట్లా చేతులుమారి, అందం పోగానే, యెవరికీ అక్కర్లేక నశిస్తారు. ఈ పాపమంతా చివరి రోజుల్లో అనుభవిస్తారు. తను ఆమెని పెళ్ళి చేసుకోడమే తప్పు. కాని ఆమె తనకి ఎప్పటికీ కావాలనిపించింది. 'తనది' ఐతే చాలు. తరువాత చూసుకోవొచ్చు ననుకున్నాడు.

మొదట ఆమెని మద్రాసు బీచిలో చూశాడు. ఇద్దరు సహాధ్యాయినులతో, అనసూయ, ప్రియంవదలతో నడిచే శకుంతలలా దర్శన మిచ్చింది. ఏదో ఆలోచించుకుంటో నడుస్తున్నారు, నీళ్ళు వొంచనే. పల్లెవాళ్ళు వేసిన తాడు చుట్టు అడ్డం. తను కళ్ళెత్తేటప్పటికి తనకి చాలా దగ్గిరగా ఆమె, తనకి డీకోడమే ఆలస్యంగా. వాళ్లు తనని చూడలేదు గావును.

"ఎక్స్క్యూజ్ మీ" అన్నాడు. చేతులుకలిపి నడుస్తున్న వాళ్ళు ముగ్గురూ తనకి అడ్డం. ఓపక్క తాడు, ఇంకో వేపు సముద్రం.

మళ్ళీ ఈ రాత్రి అట్లానే కలుసుకున్నారు. ఒక వేపు సముద్రం, ఇంకో వేపు మొగలిపొదా !

వాళ్ళు కదలలేదు. సరిగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. ఆ నిమిషానే అతని ఆత్మ ఆమె కళ్ళలో ప్రవేశించింది గావును. ఇద్దరు చెలులూ తప్పుకోవా లనుకుంటున్నారు గావును. ఆమే, వాళ్ళ చేతుల్ని వొదలలేదు.

చప్పున నవ్వి 'గుడ్ బై' అని అనవసరంగా అని, వెళ్ళిపోయింది. ఆమె తన కాలేజీకి వారానికి మూడుసార్లు లాబరేటరీపనికి వొస్తుందని కనిపెట్టి, మెట్లదగ్గిర కాచేవాడు, అడ్డంగా నిలబడేవాడు. ప్రతిసారీ, తను 'ఎక్స్క్యూజ్ మీ' అనడం, ఆమె నవ్వి 'గుడ్ బై' అనడం మామూలయింది.

తరువాత పార్క్ ఫైర్‌లో ఆకాశంవేపు తిరిగే చక్రంలో, దీపాలకింద ఎగురుతో వుండగా చూచాడు ఆమెని సఖులతోసహా. వాళ్ళు తనని చూడలేనట్టుంది. కాని వాళ్ళకి దూరంగా వాళ్ళ వెంటనే తిరుగుతున్నాడు. గంటలు గడిచాయి. ఆకలి వేస్తోంది. కాని వాళ్ళు వెళ్ళరేం మరి! యెవరికోసమో చూస్తున్నారా? లాటరీ బల్లదగ్గిర ముగ్గురూ ఒకటే ఆడారు. అలసినట్టున్నారు. బల్లమీద కూచుని ఒకరివంక ఒకరు చూసుకుని నవ్వుకుంటున్నారు. వాళ్ళ కంటబడి వెళ్ళిపోవా లనుకున్నాడు. అటు వెళ్ళిపోతున్నట్టు వాళ్ళ బెంచీముందుగా నడిచాడు. వాళ్ళు తలలు ఎత్తలేదు. అతను ఆలోచించకండానే ఆగి 'ఎక్స్క్యూజ్ మీ' అన్నాడు.

వెంటనే ఒకామె 'గాడ్ ఈజ్ గ్రేట్' అంది.

"అవర్ గార్డియన్ ఏంజల్" అంది లాలస.

వెంటనే ముగ్గురూ లేచి అతన్ని చుట్టుముట్టారు.

"ఏం చేస్తున్నారు ఇక్కడ! పరీక్షలకి చదవకండా, యువకుడా, కాలాన్ని ఇట్లా పాడు జేసుకుంటున్నావా? నాన్నగారికి తెలిస్తే ఏమంటారు?" అన్నది లాలస ఇంగ్లీషులో.

"చీమల్ని చూచి నేర్చుకో" అంది ఒకామె.

"అవును ఇంతవరకూ కాలాన్నీ, డబ్బునీ, వృథాయే చేశాను" అన్నాడు అతను గాలన్ట్‌గా.

"సరే. ఐతే మమ్మల్ని మా హాస్టలుదాకా ఎస్‌కార్ట్ చెయ్యి" అంది లాలస.

"అంతకన్నానా?" అన్నాడు.

"మాకు బస్సుకు డబ్బులేదు. వున్నదంతా ఆదుర్మార్గులు లాగేశారు" అంది మిత్రురాలు.

"రండి."

ఆ తరువాత చాలా పరిచయం. వాళ్ళూ, అతనూ ప్రతి సాయంత్రం బీచికి, రాత్రివి సముద్రంలో రవ్వలు మెరిసేదాకా, బీచిలో సమ్మర్దం తగ్గేదాకా. కాని లాలస వెంట ఆ ఇద్దరు కన్యలూగాక నలుగురు మొగ స్టూడెంట్సు కూడా వుండేవాళ్ళు. అంతకు పూర్వం ఎక్కడో కలుసుకుంటో వుండేవారని తెలిసింది అతనికి. కాని ఆలోచించడానికి అనుమాన పడడానికీ వ్యవధిలేదు. లోకమంతా అతనికి లాలస మయం. ఆ నలుగురిలో, ఆటలలో, చదువులలో, తంద్రుల పదవుల్లో చాలా ముఖ్యమైన యువకు

లున్నారు. కాని అందరూ ఆమెదగ్గిర కూచోడమే, ఆమె మాట చెవుల వినడమే గొప్ప భాగ్యంలాగు అయ్యేవారు. కాని అతనికిమాత్రం "లాలస" "లాలస" ఇకేం లేదు జీవితానికి అర్థం. ఇట్లా ముళ్ళమీద, వెన్నెల అలలమీద, ఎప్పుడూ వదలని ఆకర్షణలో గడిచిపోయింది ఆ ఏడు. శలవులకి యెవరింటోవాళ్ళు వారు పోవాలి. కాని అందరూ మళ్ళా కాలేజీలకి రావలసినవాళ్లే. శలవల్లో ఆమెకి తను రాసిన ఉత్తరాల్లో తెలియచేశాడు తన ప్రేమని. ప్రేమని తెలియజెయ్యాలి కనక తెలియజేశాడు. అంతేగాని, ఏం కావాలి తనకి? పెళ్ళా? ప్రేమా? ఇవేమీ అతను ఆలోచించనేలేదు. మళ్ళీ కలుసుకున్నప్పుడు ఓ కొత్త అర్థంతోనే కలుసుకున్నట్టున్నారు. ఒక రహస్యం వాళ్ళమధ్య వున్నట్టే వుంది మాటల్లో రాకపోయినా, రావడానికి ఎన్నడూ ఏొంటరిగా కలుసుకోనేలేదు. వీలేలేదు. ఆమె వీలు చెయ్యనేలేదు. కాని అతను మాట్లాడేటప్పుడు శ్రద్ధగా అతని మాటల్నే వినడం, మాట్లాడినప్పుడు, కళ్ళ పక్కల నుంచి అతని వంకనే చూడడం ఇద్దరికీ సంబరంగం. లాలస మీద కొన్ని ఇంగ్లీషు పద్యాలుకూడా రాసుకుని దాచుకున్నాడు అతను.

మూడు నెలల తరువాత మెడికల్ కాలేజినించి ఏడమ్స్ చేరాడు వాళ్ళ సమూహంలో. ఏడమ్స్ చాలా అతిశేత్రిన మనిషి. వాళ్ళ కాలేజీలో నర్సులూ, చదువుతున్న ఆడ డాక్టర్లూ, తనకి చాలా సులభసాధ్యమైన ప్రియురాళ్ళలాగు మాట్లాడేవాడు కొంతవరకన్నా అది నిజమేనని నాకు

కూడా. ఏడమ్స్ ప్రత్యేకంగా లాలసని, తన మిత్రురాల్ని చేసుకుని, తక్కిన ఇద్దర్నీ అతనికీ తక్కిన మొగమిత్రులకి వొదిలేశేవాడు. ఇన్ని నెలల్లో తక్కినవిద్యార్థులు చెయ్యనిదీ, చెయ్యడానికి వీలులేనిదీ, లాలసని చెయ్యి పట్టుకు లేవతీసి బీచివెంబడి దూరంగా మాట్లాడుతో తీసుకుపొయ్యేవాడు. కొన్నాళ్ళయింతర్వాత సగం చీకట్లోకూడా ఏడమ్స్‌ని చూస్తే అతనికి మొదటినించీ అయిష్టం, అనుమానం. ఇంక పట్టలేక ఓసారి లాలసతో అన్నాడుకూడా.

"ఎందుకు?"—అంది.

"నేనేం చెప్పగలను? నాకట్లా అనిపిస్తుంది" అన్నాడు.

ఆలోచిస్తోంది ఆమె.

"ఏమన్నా విన్నావా?" అడిగింది.

"లేదు"

"ఏంలేదు. అతను ఓ తరహా మనిషి. ఆడవాళ్ళు పాడుచేశారు అతన్ని, ఒకటే వెంబడిపడి, కాకపోతే, చాలా ఉత్తముడు."

ఏమైతేనేం! లాలస చాలా ఉత్సాహంగా వుంటోంది. ఓ సాయంత్రం ఏడమ్స్, లాలసా దూరంగా వెళ్ళినపుడు చెలికత్తెలలో వొకరు;

"ఆ ఏడమ్స్‌ని చూస్తే వొళ్ళుమంట. వాణ్ణిచూస్తే లాలసకి చాలాఇష్టం, ఉత్తరాలుకూడా రాస్తున్నట్లున్నాడు. చెపితే వినదు" అంది, ఆ మాటలు అనడం ఆపుకోలేక,

తరువాత ఓ నెలరోజులకి గావును కాలేజిలో కనప డ్డప్పుడు లాలస అతన్ని మర్నాడు తన హాస్టలుకి ఓసారి రమ్మంది. ఏమిటా అని ఆలోచించాడు ఆ రాత్రంతా. లాలస పదిరోజులనుంచి చాలా దిగులుగా వుంటోంది. పర ధ్యానంకూడా. ఏడమ్స్ రావటంలేదు. అది మొదటిసారి ఆడవాళ్ళ కాలేజి హాస్టలుకి వెళ్ళడం అతను. విజిటింగు గదిలో కూచుని కబురు పంపాడు. ఆమె దిగులుగా వొచ్చి కూచుంది.

"నాకోపని చేసిపెట్టాలి నువ్వు."

"తప్పకుండా."

దిగులైన చిరునవ్వుతో, "మరి ప్రశ్నలడగగూడదు."

"ఊహు"

"చాలా మోధుడిలాగు వొప్పుకొంటున్నావు. నీకు అయిష్టం కావచ్చు ఆపని."

కొంచెం తటపటాయించాడు. ఆమెవంక చూశాడు. మార్నింగ్ గ్లోరీ తీగెల్లోంచి ఆమెమీద పడుతోంది, ఆమె నడుందగ్గిరనుంచి పాదాలవరకు జార్చిన చీరె కుచ్చెళ్ళ అందంకోసం ఏం చెయ్యడు అతను ?

"పరవాలేదు."

"నువ్వు మెడికల్ కాలేజికి వెళ్ళి ఏడమ్స్‌ని కలుసు కోవాలి."

"ఊఁ"

"అతను ఏమైనాడో, ఎందుకు రాడో అడిగిచెప్పు"

"నువ్వే పంపించావనేనా?"

"ఊఁ"

అతని హృదయం భగ్నమంది. ఏడమ్సుని చూడకుండా వుండలేదా ఈమె?

"అతన్ని కలుసుకోకుండా వుండలేనంత..."

"ప్రశ్నలు——"

"పోనీలే, ఫోన్ చేస్తాను."

"ఆమాత్రం తెలీదనుకోకు నాకు."

"పోనీ ఉత్తరం రాయి."

"అవన్నీ చెయ్యడానికి నిన్ను పిలవాలా ఇంత దూరం?"

వినికిస్తున్నాడు తను ఆమెని

"సరే"

"థ్యాంక్స్"

లేచాడు,

"కాని ఆ ఏడమ్స్..."

"తెలుసుగా నాకు, చెప్పావు ఇదివరకు."

"కాని మళ్ళీ."

"ప్రశ్నల్లో ఉపన్యాసాలుకూడా ఇమిడివున్నాయి."

చాలా సెనిల్ అయినాడు.

"సరే, కాని, మరీ."

"ఇంకా?"

వెళ్ళిపోయినాడు సరాసరి ఏడమ్స దగ్గిరికి.

"హల్లో! ఏమిటీ రాక?"

అతన్ని కలుసుకోడం ఏమీ ఇష్టంగా లేదు. ఏడమ్మకి.

"రావటం లేదేం?"

"పంపించిందా?"

"రావటం లేదేం?"

"బుద్ధిగలవాణ్ణి కనక. మీలాంటి కుర్రాళ్ళు. ఆడ పిల్లల నవ్వుల్లో కాలం గడపడం మీకు సరదా — ఉట్టి భేదాలు."

"ఇదివరకంతా?"

"ఆశ"

"దేనికి?"

"ఏదో లెద్దూ! నన్ను విసిగించకు ఫూల్ లాగు."

తనతో అంత చనువు లేదు ఏడమ్మకు, తనుగా వొచ్చినందుకు అంత చవకైనాడు తాను.

"నేవ్ కావడంకన్న ఫూల్ కావడం నయం."

"మీరు వెడితే బాగుంటుందేమో!"

"ఇంక రారా?"

"నేను మీకు జవాబు చెప్పవలసిన పనేమిటి? వొస్తే వొస్తాను."

వొచ్చేసి చెప్పాడు. ఆ మాటలు చెప్పడం అతనికి కొంత విజయవంతంగా వుంది. ఆమెకోసం సిగ్గుగానూ వుంది. ఆ మాటలకి ఆమె కన్నీళ్ళు ఆపుకుంటోం దనిపించింది. ఏమైతేనేం! అతను అక్కడవున్న దృష్టే పోయింది ఆమెకి. లేచి వెళ్ళిపోయినాడు. ఆ సాయంత్రం ఆమెగాని, సఖులుగాని బీచికి రాలేదు.

... ...

వారం రోజులతరువాత కాలేజిలో చిత్రమైన వాదులు రేగాయి, లాలసనిగురించి.

"ఆమె రాత్రులు హైంకి హాస్టలుకి రావడం లేదు."

"సినిమాలకి వెడుతోంది"

"కావలసిందే ఆ సూపరెంటెండెంటుకి. చాలా గర్వం ఆమెకి. ఎదిరించేపిల్ల ఒకత్తె ఈనాటికి తటస్థించింది."

"మెడికల్ కాలేజి దగ్గిర కనబడుతోంది లాలస."

ఆనాడింకా విద్యార్థులకి అధికార్లని ఎదిరించడమంటే చాలా భయమైన సంగతి. ఈనాటిమల్లే ఎదిరించినవాళ్ళు యోధులు కాలేదు. అందుకని ఆమెని చాలామంది కంటగించుకుంటున్నారు. దిగులుపడ్డారు. భయపడ్డారు. ఆమెని చూడడానికి ప్రయత్నించారుగాని, లాలస దర్శనం కాలేదు. ఆమె కాలేజికికూడా రావటం లేదు. వారం రోజుల తరువాత లాలసని హాస్టలునుంచి పంపించేశారని తెలిసింది. ఆ మర్నాటినుంచి ఆమె కాలేజీకి వొచ్చింది. మరి బస ఎక్కడ పెట్టిందో? కాలేజి విద్యార్థులూ, విద్యార్థినులూ ఆమెని సాంఘికంగా బహిష్కరించారు. అతనికి ధైర్యం లేకపోయింది ఆమెని పలకరించడానికి. ఆమెని హాస్టలునించి పంపెయ్యడానికి అనేక కారణాలు చెప్పుకుంటున్నారు. సూపరెంటెంటుని చెంపమీద కొట్టిందనీ, లాలసే లేచిపోయిందని, ఏడమ్మనతో కాపరం పెట్టిందని—ఇట్లాంటివి. తనని ఆప్తుడికింద తీసుకోలేదని అతనికి కోపంగావుంది. ఆమె చెలికత్తెల్ని అడిగాడు. కాని వాళ్ళకీ ఏమీ తెలీనట్టుంది. మొదటిరోజున ఆశతో లాలస తనవంక చూసిందేమో నను

కున్నాడు గాని, ఆమెని తానే పలకరిస్తే, పక్కనున్న మిత్రులు బతకనీరు. అవినీతి నిందవేస్తే భరించగలడు, పురుషుడు. కాని ఇంగ్లోరమీాద ఇష్టపడిన స్త్రీపక్షం వహించ డానికి చాలా ధైర్యం కావాలి.

పదిరోజుల తరవాత అందరికీ ఆహ్వానాలువొచ్చాయి_ ఒక ఇంగ్లీషు హోటల్లో ఏడమ్సుకీ, లాలసకీ పెళ్ళి జరుగు తుందని. అందరూ ధైర్యాన్ని కూడపలుక్కుని, వెళ్ళతలుచు కున్నారు. రాత్రి ఎనిమిదింటికి పెళ్ళి. తొమ్మిదింటికి హిందూ డిన్నరు. ఓ పదిమంది గొప్పగా డ్రెస్ వేసుకుని హాజరైనారు. హోటల్లో విద్యార్థులందరూ, అన్నిజాతుల వాళ్లూ అనేకవిధాలైన అలంకారాలతోవొచ్చారు. హాస్టలు సూపరిండెంటు, లెక్చెరర్లుకూడా వొచ్చారు. కాని మెడికల్ కాలేజీనుంచి ఒక్కరూ రాలేదు. పెళ్ళికి అంతా సిద్ధంగా, రమ్యంగా అలంకరించారు, హోటలువాళ్లు. పెళ్లి చేసే రిజిస్ట్రారుగారు వొచ్చారు. ఎనిమిదయింది. పెళ్ళికొడుకూ రాలేదు, పెళ్లికూతురూ రాలేదు. సరే, తొమ్మిదింటిదాకా ఒకళ్ళమొహాలు ఒకరు చూసుకుంటూ కూచున్నారు. ఏం చేస్తారు? బైలుదేరారు ఇళ్ళకి. తిండీ? వెళ్లిపోతూవుంటే, హోటలువాళ్ళు వొచ్చి భోజనాలకి రమ్మన్నారు. వధూ వరుల సంగతి హోటలువాళ్ళకీ తెలీదు. కాని భోజనాలకి అదివరకే డబ్బిచ్చేశారు. చాలా చెడ్డ ప్రాక్టికల్ జోక్ జరిగింది. కాని ఇంత ఖర్చుతోనా? చాలా గొప్ప భోజనం ఆ రాత్రి.

మర్నాటినుంచి పుకార్లు లెక్కలేనన్ని. లాలస కాలేజికి వొచ్చింది కాని ఎవరితో ఏం మాట్లాడలేదు. పెళ్ళి సంగతి తనకి తెలీనట్టు తల వొంచుకొని నిబ్బరంగా వెళ్ళి పోయింది. ఆమెకి పెళ్లి అయిందంటే నిరాశ, పెళ్ళి ఆగి పోయిందంటే ఆశా తనలో ఎక్కడో వున్నాయనే అనుకుం టాడు, ఆమెని పెళ్ళిచేసుకోవాలని ఇదివరకే అతనిలో అతనికి తెలీకండావుంటే. ఇప్పుడది చాలా బలమైవుంటుంది తెలీకండా. అట్లా కాలేజినే లెక్కచెయ్యక, ఏమనుకుంటు న్నారో తననిగురించి అనే సంగతే లక్ష్యంలేక, మామూ లుగా తిరగడానికి చాలాధైర్యం కావాలి. ధైర్యం స్త్రీలలో వుంటే మరీ ఆకర్షిస్తుంది పురుషుణ్ణి. అందులో ఆమె చాలా లైంలైటులోవుంది. గొప్ప హీరోయిన్. ఆమె అందాన్ని చూస్తే ఎంత కళ్లు తళతళమంటాయో, ఆమె చరిత్రని తలుచుకుంటే అంత డాజిలింగ్‌గా వుంది. కాని ఆ రంగుల నిప్పుపువ్వుల్ని రాల్చే తారాజువ్వ మామూలు భార్యకింద ఎంతవరకు ఇముడుతుందనే ఆలోచన రాదు యువకుడికి.

వెంటనే బైలుదేరాయి పుకార్లు, చివరి నిమిషంలో ఏడమ్సు పెళ్ళికి నిరాకరించాడనీ; లాలసతండ్రి మద్రాసు వచ్చి మానిపించాడనీ, ఏడమ్సుని తన్నాడనీ, కాలేజినుంచి డిస్మిస్ చేయిస్తానన్నాడనీ, లాలస తండ్రి భాగ్యవంతుడు గనుక ఏడమ్సు చాలా ధనం అడిగాడనీ – ఇట్లాంటివి ఒక దాని కొకటి విరుద్ధమైనవి. తరవాత కొన్ని రోజులకి గాని తెలీలేదు నిజంసంగతి. ఏడమ్సుకీ, డాక్టరు చదువుతున్న ఇంకో విద్యార్థినికీ రహస్యంగా ఇదివరకే క్రిష్టియను వివాహం

జరిగిందనీ, ఆమెకాక ఏడమ్సుకి వూళ్ళో ఇంకో భార్యకూడా వుందని పుకారు పుట్టింది.

తరువాత ఏం జరిగిందో పదిరోజుల్లో లాలస మళ్ళీ హాస్టలులోవుంది. ఆ రోజుల సంగతి లాలస అతనిభార్య ఐన తరవాతకూడా అతనితో వివరంగా చెప్పలేదు. అతనెన్నిసార్లు ఎత్తినా, ఆ చెడ్డకలని జ్ఞాపకం చెయ్యవొద్దన్నది.

ఆమె కాలేజిలో యెవరితోనూ మాట్లాడటంలేదు. అందరికీ ఆమెతో ఇదివరకటి పరిచయం చేసుకోవాలనేవుంది. ఒకరోజు లెక్చరర్‌కి ఆలస్యమై రెండేసిమెట్లు గెంతుతో, పరిగెత్తుతో, వొంపులో ఎవరినో పరధ్యానంగా వొచ్చేవారిని ఢీకొన్నాడు. చూడకుండానే ఎక్స్యూజ్ మీ అని, పరిగెత్తుతున్నాడు.

"నేను 'గుడ్-బై' అనను" అంది ఆమె.

చప్పున తిరిగి చూశాడు, నవ్వుతోంది ఆమె. ఇంక లెక్చరులేదు ఏమీలేదు, ఆమె వెంట వెళ్ళాడు. ఆవేళనుంచి మళ్ళీ బీచిమీద మామూలు మీటింగులు మొదలు. కాని ఆమెలో పూర్వ సంతోషంలేదు. అప్పుడప్పుడు అడిగేవాడు, ఏమిటి దిగులని, కాని నిట్టూర్పుతప్ప ఆమెనించి ఇంకేం రాలేదు. అంతే పరీక్షలైపోయినాయి. ఇంక ఎవరి వూరికి వాళ్ళు వెళ్ళిపోతారు, ఆమె పులిచెరీ వెళ్ళిపోతుంది. ఇంక ఆమె కనపడదు తనకి.

ఎన్ని చిన్న అర్థంలేని అల్లరి సంఘటనవల్ల జీవితానికి జీవితాలే మారిపోతాయో! ఆమె పరీక్షలు కాగానే, వెళ్ళి

పోతుంది తండ్రిదగ్గిరికి. తామందరూ వెళ్ళారు రైలుస్టేషనుకి. ఆమె సెకండుక్లాసులో కూచుంది, వాళ్ళందరికీ షేకాండ్లు ఇచ్చి. రైలు బైలుదేరబోతోంది. ఆ లైట్లకింద వెలిగిపోతోంది ఆమె అందం. దౌర్భాగ్యుడు ఏడమ్ను! ఈనాడు తను దౌర్భాగ్యుడు.

ఆమె ఏదో మాట్లాడుతోంది అతనితో. ఇంజనుకూత చప్పుడులో వినబడలేదు. వినడానికి తను పెట్టెలోనికి ఎక్కాడు. ఆమె నొక్కుత్తే దాంటో. రైలు కదిలింది. తాను ఆమె మాటకి నవ్వుతున్నాడు. తక్కినవాళ్లు రైలువెంబడి నడుస్తున్నారు.

"ఇంక చాల్లే ప్రతాపం, ఇంక దిగు" అన్నారు.

"ఆమె చెయ్యి తనచేతిలో ఉంది."

"ఎక్స్క్యూజ్ మీ" అన్నాడు.

"గుడ్-బై" అన...

" 'అనను' అను" అన్నాడు.

రైలు వేగం హెచ్చింది.

"దిగు, దిగు" అని అరిచారు.

"దిగను" అన్నాడు - ఏమీ అర్థం లేకండానే.

అరుస్తున్నారు.

"ఆడవాళ్ళ పెట్టె."

"టికెట్టురా!"

మరీ పట్టు హెచ్చింది అతనికి. వాళ్ళందరూ చూస్తుండగా ఆమె పక్కన కూలబడ్డాడు. రైలు ప్లాట్ఫారం దాటింది.

ఎదురుగా ఒక ర్నొకరు చూసుకున్నారు. ఆమే మొదట తన మెడమీద చేతులు వేసిందో, తనో తెలీదు. పెదిమలు పెదిమలు వొదలలేదు ఊపిరి లాగిందాకా. అతన్నించి తప్పించుకుని నవ్వింది. నవ్వుతో కలిపే ఏడ్చింది.

మళ్ళీ బుజ్జగించి చూశాడుగాని దూరంగా జరిగింది. స్టేషన్లు, దీపాలు, ఎగిరిపోతున్నాయి. పక్కుమని వెలిగి శలవు తీసుకున్నాయి. చాలాసేపు మాట్లాడలేదు.

"ఏం చేస్తావు వెళ్ళి ?"

"పెళ్ళి."

"ఎవరికీ ?"

"ఏమో ?"

"ఇంక కనబడవు ?"

"ఊ"

తరవాత మాటలు అతను మాటాడలేదు.

"నన్ను పెళ్ళి చేసుకో... మాట్లాడకు...లాలసా నీమీది నా ప్రేమ...ఏ మాటలతో చెప్పను ?"

అంటున్నారు ఎవరో అతనిలోనించి.

"నిన్నా."

"ఏం ? తగనా ?"

ఆమె వినలేదు ఆ ప్రశ్న.

"పాపం. నిన్నా!"

దాంతో అతని ఆశలు కూలిపోయినాయి. ఆ మాటలు కావు, ఆ కంఠస్వరం.

మళ్ళీ మాట్లాడలేదు అతను. మొహం తిప్పేసుకున్నాడు. ఇంజను రవ్వలుమల్లే కనపడ్డాయి అతనికి మనుషుల ఆశలు, బొగ్గు నలుసులు.

స్టేషన్లో ఆగింది రైలు. ఆడవాళ్ళు వొచ్చారు ఎక్కడానికి. దిగిపోబోతున్నాడు. అప్పుడూ ఆమె అతని వంక చూడలేదు. దిగి, ఆమె చేతిని పట్టుకుని "ఉత్తరం రాస్తావా?" అన్నాడు.

"ఊం."

కుంగిపోయి వెళ్ళిపోయినాడు.

అబ్బా, రాయిమల్లే అవుతోంది ఆమె. ఆనాడు మాల్వంకర్ వ్యవహారంలోనూ అంతే. శాపం తిన్న అహల్య వల్లే అయింది. అట్లాకాక సంగతులన్నీ పైకి మాటాడితే తన సంసారం ఇట్లా అయేదికాదు.

వాన ఆగింది. చాలా ఆహ్లాదమైన గాలి. ఆమెతో యెండాకాలంలో ఇక్కడికి తను వొచ్చివుంటే యీ గాలిలో తన పక్కన ఆమె ఆ చిన్న చలికి తనకు దగ్గరగా ముడుచుకుంటో, ఆమె ఇక్కడే ఢిల్లీలోనే వుందా? ఇవాళ సముద్రంలోంచి తమను బయటపడేసిన ఆమె లాలసేనా? వుందా? ఆ ఊళ్ళోనా? ఆమేనా? అయితే తాను తెచ్చుకోగలడా? వొస్తుందా?

ఉత్తరం రాస్తానన్నదేకాని ఏమీరాయలేదు లాలస. తను ఉత్తరం రాయాలంటే ఆమె చిరునామా తెలీదు. మళ్ళీ మద్రాసు వొచ్చాడు, లా చదవడానికి. కొద్దిరోజుల్లో లాలస ఉత్త జ్ఞాపకం అయిపోయింది, అందమైన చిన్నతనం మల్లే. ఆమెని పెళ్ళి చేసుకుంటే తనవాళ్ళు వొప్పుకుంటారా? ఆమె వొప్పుకుంటే ఏం చేసేవాడు తను? మంచిదే అయింది ఆమె తొలగిపోవడం.

ఆనాటి సాయంత్రం తానూ, మిత్రులూ బీచిమీద షికారుకి బైలుదేరారు. పెద్ద గుంపూ, చుట్టూ గుర్రాల మీద పోలీసుదళం. అన్నట్టు వుప్పు సత్యాగ్రహంగావును! తనూ దూరంగా అక్కడ చేరిన దర్శకుల వెనుక చేరాడు మిత్రులతో. ఓ పొయ్యి, కుండ, ఆరిపోయిన మంట. ఆ కుండలోనించి ఉప్పు తీసుకుని ఒకామె బల్లమీద ఎక్కింది.

“ఉప్పు! ఉప్పు! విలువలేని ఉప్పు! భారతవీరుల రక్తంలోని ఉప్పు! ఎవరుకొంటారు?”

ఆమె కళ్ళు గొప్ప ఆవేశంతో మెరుస్తున్నాయి. జాకెటు, చీరల జిలుగులతో గుండెల్ని నిలవనీక ఊగించే ఆమె వొంటి వొంపుల్ని ముతక కద్దరు కప్పుతోంది. వీరాంగన విరబోసిన జుట్టు సముద్రపు గాలిలో ఎగురుతోంది పైటతో కలిపి. ఎవరూ ముందుకి రాలేదు, ఉప్పు కొనడానికి,

“ఇక్కడ మొగవాళ్ళు లేరా? ఏం తిని బతికారు? ఏముంది మీ రక్తనాళాల్లో?”

గడ్డం పైకెత్తి తృణీకారంగా, తలని వెనక్కి విరిసింది.

ఆమె లాలస!

ఆనాటి రాత్రి తాను ముద్దు పెట్టుకున్న పెదిమలు తృణీకారాన్ని విసురుతున్నాయి మొగాళ్ళమీద. తన మీదనే అనించింది అతనికి.

"ఈ రాత్రికి ఇళ్ళకిపోయి మీ భార్యలకి మొహాలు చూపిస్తారా, మీరూ ఒక మగవాళ్లమని?"

"పది రూపాయలు,"

అతనే అరిచాడు,

"తెండి" అన్నది ఆమె ఎక్కడో చూస్తో, అతను ఒక్క గంతులో ఆమె పక్కకి దూకాడు.

"ఇరవై—వంద—రెండువందలు" అని అంటుకుంది ఉత్సాహం. ఈలలు, గుర్రపుదాడి, గుర్రపుకాళ్ళ విజృంభణ, కోలాహలం, మూలుగులు, 'రామా రామా' అని అరుపులు, ఎత్తిన లాఠీలు, త్వుకుంటున్న తలలు, పరుగెత్తుతున్న కాళ్ళు—అంతే స్పృహ లేదు.

కళ్ళు తెరిచేప్పటికి ఓ చక్కని గదిలో, ఎలక్ట్రిక్ దీపాలక్రింద, పంకా కింద, హాయిగా, పక్కమీద పడుకుని ఉన్నాడు. అతని పక్కన కుర్చీలో, నూలు వడుకుతో, కద్దరు కట్టుకుని కూచుంది, వీపు అతనివేపు తిప్పి, ఒక స్త్రీ.

స్వర్గమా? చచ్చిపోయినాడా? తనతో లాలసా చచ్చిపోయిందా? పిలవగలడా? శబ్దం వొస్తుందా? తల దిమ్ము, మళ్ళీ కళ్ళు మూతలు పడ్డాయి.

మళ్లీ కాసేపటికి కళ్ళు తెరిచాడు గావును. ఎక్కడా బైటనించి శబ్దాలులేవు. కొంతకాలం గడిచివుండాలి. ఆమె ఇంకా అట్లానే కూచునివుంది. "లాలసా!"

చప్పున లేచి వొచ్చింది దగ్గిరికి. లాలసకాదు ఎవరో అమ్మాయి.

"ఎవరు?"

"ఎట్లావుంది?"

చాలా చక్కని ఇంగ్లీషులో, అమృతమయమైన కంఠంతో అడిగింది.

ఆమె యెంత అందమైనది! లాలస ఎందుకు ఈమె ముందు! నిజంగానే చచ్చిపోయినాడు తను. ఇది దేవ లోకం. కాని వొడుకుతారా, ఆ లోకంలో కూడా?

యెదురుగా పెద్ద గాంధీపటం.

"ఎవరు?"

చాలా దయగా నవ్వుతోంది.

"యెట్లా వచ్చాను? కొట్టారా నన్ను."

"అవును చచ్చిపోయినా వనుకున్నాను. కానీ పైకి అట్టే దెబ్బలేదు."

అంటోనో మందు ఇచ్చింది తాగడానికి. ఆ చేతి రుచేకాదు, ఆ కళ్ళ వెలుగేకాదు, నిజంగా చాలా హాయిగా వుంది ఆ మందు. వెంటనే బలం వొచ్చి మనసు నిర్మల మయింది. లేచి కూచున్నాడు.

“ఆమె తన పక్కనే పక్కమీద కూచుంది, మీద దయగా చెయ్యేసి.”

“అవును కొట్టారు సాయంత్రం. తీసుకొచ్చేశాము.”

“ఎవరు తీసుకొచ్చింది?”

“అడగకు”

“లాలస యేమయింది?”

“ఉప్పు అమ్మిన ఆమేనా? ఏమో!”

“ఎక్కడ వున్నాను?”

“అడగవొద్దు.

“బతికే వున్నానా? నువ్వు మనిషేనా?”

నవ్వుతో పరుపుకి అడ్డంగా పడి “అబుహాసాన్ కథ జ్ఞాపకం వొస్తోంది. చెవి కొరికి చూపనా?” అంది.

ఆమెని తాకి చూశాడు వెచ్చని చలవరాతి పువ్వులమల్లే వుంది ఆమె చేతుల స్పర్శ.

ఏమా అందం? మెరిసిపోతోంది గది అంతా— కాని లాలస పోదు, మనసునించి.

“లాలసని యేం చేశారు?”

“నీ భార్యా, ప్రియురాలా?”

“ఏదీ కాదు.”

ఆమె మొహంమీద విరామం. ఏమిటది? అతనేం అర్జనుడా?

“లాలస ఏమయింది?”

"ఏమవుతుంది? ఖైదుచేశారో, లేక ఎవరన్నా ఇట్లానే రక్షించి తీసుకువెళ్ళారో. లేక ఇంటికి వెళ్ళిందో? లాలసకి వొచ్చిన భయం ఏంలేదు, బ్రిటీషు ప్రభుత్వంకింద. ఆ భయాలన్నీ స్వరాజ్యం వొచ్చినప్పుడు" అని నవ్వింది.

"స్వరాజ్యాన్ని ఎక్కిరిస్తోనే వొాడుకుతున్నావా?" అడిగాడు. ఆ గొప్ప కళ్ళ కొనల్లోంచి గాంధిగారి పటంవంక చూసింది.

ఎంత ధన్యుడివి గాంధీ! లాలస ప్రాణాలర్పించింది. ఈ దివ్యమూర్తి నీ కోసం అర్ధరాత్రి వొాడుకుతోంది, స్వరాజ్యంలో నమ్మకం లేకండానే. "లాలసని యెందుకు తీసుకురాలేదు?" అడిగాడు.

"అదే పనా మాకు? భోజనం చేస్తారా?"

"భోజనమా? లాలస?"

"ముందు భోజనం చెయ్యండి" అడిగింది.

"చేతకాదు. ఆకలిలేదు. నేను వెళ్ళాలి."

"ఇప్పుడా? ఎందుకు?"

"లాలసని వెతకాలి."

"లాలసకి వచ్చిన అపాయం లేదన్నానుకదా! నమ్ము."

"వెళ్ళకండా నిలవలేను. నీ పేరు?" అడిగాడు.

"మదాలస" అన్నది నవ్వుతో.

"మదాలస? నిజమా?"

"లాలసకన్న బావుండలేదా ?" నవ్వింది దిగులుగా.

"లాలస ఏమయిందో ?"

"మరిచిపోరా ఆ లాలసని ! ఎక్కడని ఈ రాత్రి వెతుకుతారు ?

"లాలస ఏ అపాయంలో వుందో ! నేను సుఖంగా నిద్రపోగలనా ఇక్కడ ?"

"అయితే, వెళ్ళిపోతారా ?

"నువ్వు వుంటే నాతో !"

"రాత్రంతా యెట్లా వుండను ?"

"నేను వెడతాను, నువ్వు వెళ్ళిపోయేప్పుడు" అన్నాడు.

"ఉంటారనుకున్నాను. మీరు ఖద్దరు కట్టుకోలేదేం?"

"నాకేం సంబంధం లేదు."

"అయితే లాలసకోసమా ఈ దెబ్బలు తిన్నది ?"

"ఊఁ"

"అయితే నాన్నగారిని బతిమాలేదాన్ని కానే మీ కోసం" అంది నవ్వుతో.

"మీ నాన్నగారు యెవరు ?"

"అడక్కూడదు. మీరు ఇక్కణ్ణించి ఎప్పుడు వెళ్ళినా, ఎక్కడినించి వెడుతున్నారో తెలుసుకోకూడదు. తెలిస్తే మరిచిపోవాలి. వాగ్దానమేనా ?"

ఆ పెదవులు "నువ్వు పిల్లిగా మారిపోతావని వాగ్దానం చెయ్యి" అంటే చెయ్యడా ?

"యెందుకు రహస్యం ?" అడిగాడు.

"నాన్నగారు పెద్ద గవర్నమెంటు ఉద్యోగి. తెలిసిందా? రాత్రులే నేను ఈ ఖద్దరు, ఈ వడకడం. మీరు వాడకరా? లాలసకోసమా?" అంది చాలా దిగులుగా, ఏదో జ్ఞాపకం తెచ్చుకుంటో.

"వెళ్ళండి" అంది నిరాశతో, కన్నీళ్ళతో.

"ఏమిటి?" అన్నాడు చేతులు పట్టుకుని.

"భగ్నమైన కల" అని లేచి వెళ్ళిపోయింది.

ఏదో కేకేసి మళ్ళీ వొచ్చి కూచుంది, అతనికేసి చూడకుండా. అవును, యెట్లా? లాలసని ఆ రాత్రి ఎక్కడ వెతుకుతాడు? పొద్దున్నే వెళ్ళవచ్చు.

తలుపుమీద చిన్న శబ్దం. మదాలస లేచి వెళ్ళి, పళ్ళాలలో భోజనం అందుకుని బల్లమీద పెట్టింది.

"రండి."

అతని పక్కనే కూచుని తినిపించింది.

"మీకు పెళ్ళి అయిందా, మదాలసా?

"మీకు?"

"కాలేదు."

"నాకూ కాలేదు" అంది, అతని కళ్ళల్లోకి చూస్తో, దిగులుగా."

"ఎందుకు కాలేదు ఇంకా?"

మాట్లాడలేదు.

"యెప్పుడూ ఇట్లా దిగులుగానే వుంటావా?"

"లేదు, ఈ రాత్రికే."

"తరవాత ?"

"యెట్లా తెలుస్తుంది ?"

"నే నున్నానా ఆ దిగులులో ?"

దానికి జవాబు చెప్పక తన చదువుసంగతీ, సంగీతం, స్నేహితులసంగతీ మాట్లాడింది. కొచ్చిన్‌లో చదువుకుంది ఇన్నేళ్ళూ. అందుకనే మద్రాసు పరిచయం లేదు.

భోజనమైనాక మళ్ళీ పడుకున్నాడు. ఆమె అతని పక్కన కూచుంది. ఆమె చేతిని పట్టుకొని రొమ్ముమీద పెట్టుకున్నాడు.

"పొద్దున్నదాకా వుంటాను. నిద్ర పట్టిందాకా నా దగ్గిర వుండు."

"పగలు వెళ్ళడానికి వీల్లేదు. మీరు వుంటే, వెళ్ళడం రేపురాత్రే !"

"అయితే వెడతాను" అని లేచాడు. అడ్డంగా కూచుంది. కింద స్ప్రింగు. ఆమె భుజాలు పట్టుకునిగాని లేవడానికి వీల్లేకపోయింది. ఆమె అతనిమీదికి వొరిగింది. పిలుస్తున్న ఆమె పెదవుల్ని ముద్దు పెట్టుకోకపోవడం మానవ శక్తిలో లేదు.

"ఉండిపో. వెళ్ళకు" అంటో అతన్ని లాక్కుంది.

అంతకన్న ఏం కావాలి ?

ఆమెని కావిలించుకుని అదుముకున్నాడు. మెల్లిగా, తీయగా, చిరునవ్వుతో అతని కౌగిలినించి వొదిలించుకుని, లేచి నుంచుంది.

"తెల్లారకట్టే వొస్తాను. ఏం ?"

"మరి ఓ టాక్సీనికూడా పిలిపించు."

"ఎందుకు ?"

"లాలసని వెతికి తెలుసుకుని, సాయంత్రం వొస్తాను."

"లాలస రానీదు."

"లాలసకి ఎందుకు ?" అంటున్నాడుగాని, సందేహం లాలసకి యెందుకేమిటి ?

"అదీకాక, లాలసకోసం తలకి కట్టు కట్టుకుని వెతికే వాళ్ళు, మళ్ళీ ఇక్కడికి రావడానికి వీల్లేదు."

"ఏమి ?"

"అంతే."

"నువ్వు వొచ్చెయ్యి, నాతో."

"వొస్తాను. లాలసకోసం వెతక్కండా వుంటే."

"మరి ఏమయిందో తెలుసుకోవద్దా ?" అన్నాడు.

"తెలుసుకుని, తరువాత ?"

"అంటే ?"

"ఇంక లాలసని మరచిపోవాలి" అన్నది ఆమె.

అమ్మో ! అనుకున్నాడు.

"ఇంక ఇక్కడికి రావా ?" అడిగాడు.

"పెళ్ళి చేసుకుని వొద్దాము."

కాని, లాలస; వీరాంగన. లాలస.

"లాలసను మరిచిపోలేను."

కళ్ళనిండా నీళ్ళు.

"ఐతే ఇప్పుడే వెడితే మంచిది."

"అంతే ననుకుంటాను."

వెళ్ళిపోయింది. అతని తల తిరుగుతోంది. ఆలోచించడానికీ, నిశ్చయించడానికీ వ్యవధిలేదు. కాని లాలసమీద పట్టు చాలా స్పష్టం అతనికి. ఆ లాలస తనని చివరి కిట్లా చేసింది. ఈ కథ, తన త్యాగం, యెన్నడూ చెప్పలేదు లాలసకి అతను.

"కారు సిద్ధంగా వుంది."

లేచాడు, అతన్ని కావిలించుకుని ఏడ్చింది.

"నన్ను చెడ్డగా తలచకండి. మిమ్మల్ని చూస్తే అల్లాంటి ప్రేమ వొచ్చింది, ఏ పురుషుణ్ణీ తాకని నాకు మీ రెవరో తెలియకండానే. లాలస పక్కకి దూకిన మీ సాహసాన్ని చూశో, లాటీ దెబ్బతిని పడిపోయిన మిమ్మల్ని చూశో. అంతే. రండి."

గుమ్మం దగ్గరకి వెళ్ళాక.

"లాలసని అరెస్టు చేశారు. కారు మిమ్మల్ని ఆ పోలీసు స్టేషన్ దగ్గిర దిగపెడుతుంది. షోఫర్ని ఏమీ అడగకండి. అడిగి లాభంలేదు" అంది.

"మళ్ళీ నిన్ను..."

"మళ్ళీ అనేదిలేదు జీవితంలో, నాకు మీరు ఓ సాయంత్రం కల. నేను మీకు ఓ గంట కల."

"నిన్ను పెళ్ళి చేసుకోవా లనుకుంటే?"

"ఎవరితో మాట్లాడుతున్నారో మీకు తెలీకపోవడం అదృష్టం. అంత ఆలోచించి తిరిగివొస్తే, కనపడే...ఉత్తకల ఇది, కలని నిజం చేసుకోవాలంటే కలలోనే నిలవాలి.

కళ్ళు తెరిస్తే ఏమీ లేదు. మళ్ళీ ఎంత కళ్ళు మూసుకుని రమ్మని పిలిచినా రాదు....

"రండి."

యెంత కఠినత్వం ఆ కంఠంలో.

తోవలో తోటలో—

"లాలసకి నా వందనాలు చెప్పండి. జీవితంలో యెన్నటికీ దేశ దాస్య నివృత్తి యత్నం వొదిలి నిద్రపో వద్దనండి..." అంది.

షోవరు అతనివంక చూడలేదు. ఎన్ని మైళ్ళు వెళ్ళారో! కారు అని, షోఫరు తలుపు తీశాడు- అతను దిగాడు. మాట లేకండా దూరంగా చూసి, కారులో వెళ్ళిపోయినాడు, షోవరు.

పోలీసుస్టేషన్ నిద్రపోతోంది, లాలసని పొట్టలో పెట్టుకుని. యెవర్ని ఏ నుడిగినా, లంచం పెట్టినా మాటాడలేదు.

"అవును, కైదుచేశాం. యెవరైతేనేం? యెవరో మాకు తెలీదు" అంతే.

ఆ తలుపులవెనక లాలస వంటరిగా! యెవరో ఏం చేస్తున్నారో ఆమెని!

కాని లాలసని ఏం చెయ్యడానికి గుండెలా! కాని యెంతమంది అంతఃపుర వనితల్ని ఏం చెయ్యలేదు ఈ పోలీసులు? ఈ ఉద్యమంలోనే, పురుషులు ప్రాణాలు అర్పిస్తే, స్త్రీలు ప్రాణాలకన్నా అమూల్యమైనదాన్ని

అర్పించారు దేశంకోసం, గాంధిగారికోసం. లాలస వొక లెఖ్ఖా!

ఎట్లా భరించడం ?

గతిలేక వెళ్ళిపోయినాడు, బైట నిలిచి 'లాలసా' అని కేకలు వెయ్యాలనే వెర్రికోర్కెని అణుచుకుని.

* * *

ఆనాడు ఆమెని, మేస్ట్రీటుముందు విచారణకి పెడతారు! పొద్దుణ్ణించి కోర్టుముందు కూచునివున్నాడు. పోలీసులు కారులో లాలసని తీసుకొచ్చారు. గుంపులో తను దగ్గిరికి వెళ్ళడానికికూడా వీలులేకపోయింది. సాయింత్రం నాలుగయింది, లాలసకి మేస్ట్రీటు తొమ్మిదినెలల కైదుశిక్ష వేసేటప్పటికి.

కోర్టునించి లాలసని బైటికి తెచ్చేటప్పటికి వెయ్యిమందికి పైగా జనంవున్నారు. చాలామంది పూలదండలు తీసుకొచ్చారు. తనెక్కడో వెనక వున్నాడు. తలకి కట్టూ తనూ. ఆమెని కారులో ఎక్కిస్తున్నారు టైంలేదు. తన పక్కన నుంచున్న ఒకామె చేతిలోంచి "నేను వేస్తాను, ఇట్లా తెండి" అని పూలదండ లాక్కుని ముందుగా పోలీసుకారు దగ్గిరికి వెళ్ళి నుంచున్నాడు. లాలస అతన్ని చూడగానే తొరతొరగా అతని దగ్గిరికి వొచ్చింది. గుంపు తప్పుకుంది. పోలీసులు వెనకపడ్డారు. తను దండవేస్తో వుండగానే, ఆమె అతని మెడచుట్టూ చేతులువేసి ముద్దు పెట్టుకుంది.

"ఈయనే నానించి ఉప్పుకొన్నది" అని అరిచింది.

"రాజాధి రాజులకు దొరకని బహుమానం" అని అరిచాడు అతను. దాని అర్థం ఏమిటో? ఎవరెవరికి ఎట్లా అర్థమయిందో!

లాలసని తీసుకుని వెళ్లిపోయినారు.

గుంపు అతన్ని చుట్టుముట్టి, మిగిలిపోయిన దండ లన్నీ అతనికి వేసి వూరేగించారు. మళ్లీ పోలీసులు తంతారేమోననే భయమే లేకపోతే చాలా గర్వపడి ఎన్‌జాయిచేసి వుండును అతను.

ప్రయత్నించి, సిఫార్సులు తెచ్చుకొని, లంచాలు పెట్టి లాలసని మద్రాసులోనే జైల్లో కలుసుకున్నాడు. ఆమె తన కథ చెప్పింది. కాంగ్రెసు ఉద్యమంలో చేరి నందుకు, ఆమె తండ్రి ఆమెని ఇంటోంచి వెళ్ళిపొమ్మ న్నాడు, అతని ఉద్యోగానికే ముప్పు వొస్తుందని.

"నన్ను మరిచిపోయినావు కదూ?" అని అడిగాడు.

"లేదు"

"లాలసా, ఏమిటి ఇట్లా ఏళ్ళాన్నవల్లనో కలుసు కుని విడిపోవడమేనా?"

"అంతకన్న ఏం చేద్దా మంటావు?"

"అంతకన్న ఏం చేద్దామంటావో నీకు తెలీక అడుగుతున్నావా? నా చేత చెప్పించి నవ్వడానికిగాని?" అన్నాడు.

"ఎందుకు నవ్వుతాను?"

"సరేలే. ముందు జైలుకానీ. వొస్తావుగా. అప్పు ..." అన్నాడు.

"వొస్తానులే! అప్పుడు మాత్రం?"

"అంటే" అన్నాడు.

"ఈ ఊరు వొస్తే నిన్ను చూస్తాను"

"ఎక్కడ?" అన్నాడు.

"కాలేజీకి వొస్తానులేవోయ్"

"అట్లా దూరంగా మాట్లాడతావెందుకు? నీ మనసులో అంతే భాగం అన్నమాట నేను".

"నీ మనసులో నేనూ అంతే గనకనేమో?"

"ఎట్లా తెలుసు నీకు?"

"ఆట్టే కష్టంకాదు తెలుసుకోవడం."

"ఇంత వాదనెందుకు? లాలసా, జైలునించి విడుదల కాగానే నన్ను పెళ్ళి చేసుకో."

"నిన్నా? పాపం."

"ఏమిటది?"

"అంతే."

"అట్లాకాదు. నాకు ఏదో నిశ్చయంగా చెప్పి పంపించు. ఏమిటి నీ సందేహం?" అన్నాడు.

"ఏదో అంతా స్థిరంగా మాటాడుతున్నావు, నాశిక్ష తొమ్మిది నెలలలో దేశం ఏం కాబోతుందో! చాలా జీవితాలు జైలుకే అంకితమౌతాయేమో?" అంది.

"ఏమో"

"'ఏమో? అడుగుతున్నావా? అంతేలే 'లా' అయి

ప్లీడరుపని చెయ్యడమనే గీతనించి వేరే చూడలేవు. ఏం జరుగుతోంది నీ చుట్టూ? బ్రిటిషు సింహం జూలు పట్టుకుని వూగించాము. ఏం చేస్తుందో? ఎవర్ని మింగుతుందో! మనం మాత్రం వూరుకుంటామా? ఈ వేటలో ఎవరెవరు......"

"ఏమిటి నీ జీవితం అంకితమైనట్టు మాటాడతావు!"

"దూకేనుకదూ?"

"దూకితే..."

"ఆటగా ఎదో తోచక దిగాననుకుంటున్నావా? చాలా తప్పు అభిప్రాయపడుతున్నావు. సరేలే, నేను మళ్లీ రానీ మాటాడుకుందాం."

ఆమె తన జీవితానికి ఎంత అవసరమో ఆమెకి తెలీదు గావును_ అనుకున్నాడు.

"ఆరాత్రి ఎంత భయపడ్డాను! ఆడదానివి—ఇంత అందమైన దానివి_వొంటరిగా ఆ పోలీసుఠాణాలో వాళ్లు రాత్రి నిన్నేం చేస్తారోనని."

"ఏమీ చెయ్యరు"

"ఏమిటా ధైర్యం నీకు? దిక్కెవరు?"

"నా అందం."

"అందమా? అదే కొంపతీస్తుంది."

"అందాలలో బేధాలులేవూ? అందం మనిషికి గొప్పతనాన్నిస్తే - ఆ రకమైన అందాన్ని చూస్తే మృగాలకికూడా భయం."

"కాని..."

"విను. దుర్మార్గులకి స్త్రీ రెండు కారణాలనించే లోకువవుతుంది. అతను తన నేంచేస్తాడో అనే భయం – తననేమన్నా చెయ్యాలనే కుతూహలం."

"ఆడవాళ్ళమీద సినికల్‌గా మాటాడుతున్నావు" అన్నాడు.

"కాదు. నిజం. స్పష్టంగా ఏమన్నా చెయ్యాలని లేకపోయినా, తనని చూసి ఆశపడకపోతే ఆడదానికి న్యూనత. అదే అపాయం ఆమెకి. ఆ ఆశ ఆమె ఇష్టపడ్డదానికన్నా హద్దు మీరుతుంది నాకేం భయం లేదు ప్రస్తుతం." అంది.

ఇనపచువ్వల్లోంచి మీదపడే ఎండలో మెరిసే ఆమె వెలుగుని వొదిలి వెళ్ళిపోయినాడు.

జైలులో నిరాహారదీక్ష సాగించడానికి లాలస నాయకురాలు కావడం, ఈ గోలలవల్ల ఆమెని నెల్లూరు జైలులో చూసే వీలు లభించలేదు అతనికి.

తొమ్మిది నెలలుకాగానే నెల్లూరు వెళ్ళాడు, రెండు రోజులు ముందే. ఆమెకి ఇంకా శిక్షపడ్డది. మూడు నెలలదాకా వదలరన్నారు. తను బి. యల్. ప్యాస్‌ఐ ఎప్రెన్టిస్ చేస్తూ నెల్లూరు వెళ్ళాడు మళ్ళీ. అప్పటికి వొదిలేశారు. వెళ్ళిపోయిందన్నారు. జైలునించి వొచ్చికూడా తనని కలుసుకోలేదని అతనికి చాలా కోపం వొచ్చింది. ఆమెకోసం యెక్కడ వెదుకుతాడు? అయినా అంత తనని మరిచిపోయే మనిషిని వెతికి ఏం

లాభం? కాని దేశసేవా నిమగ్నమైన ఆమె మనసులో తనపైన యెందుకు అంత బలమైన స్థానంవుండాలి? ఆమె త్యాగం ముందు తన బతుకు యెంత అల్పం! అని భక్తితో ఆమెని తలుచుకుని వూరుకున్నాడు.

ఆరాత్రి తను అనంతపురం వెళ్ళిపోతున్నాడు. ఇంక అక్కడ ప్రాక్టిస్ పెట్టాలి. పెళ్ళిచేసుకోవాలి. లాలస కాకపోతే మదాలసైనా తనకి ప్రాప్తించగూడదా?

రైలు కదులుతోంది. మూడేళ్లకిందటి ప్లాట్ఫారమ్ దృశ్యం జ్ఞాపకం వొచ్చింది ఈనాడు తనని యెవరూ పంపడానికి రాలేదు. ఇంకా ఇద్దరున్నారు పెట్టెలో తనకు యెదురుగా. రైలు పక్కనించి తిరిగి వెళ్ళిపోతున్నారు మనుషులు.

"ఆడుగో సింగ్" అన్నారు. తలుపు తీసుకుని లోపలదూకారు, లాలస వెనకాలే. రైలుకూత. వెంటనే బైటికిదూకారు అందరూ.

రైలు పోతోంది. "దిగు దిగు, చాల్లే" అంటున్నారు, ఆమె మిత్రులు. కలలోమల్లే అతని చేతులు పట్టుకుని నవ్వుతోంది ఆమె.

"దిగు, దిగు" అని అరుపులు - రైలు వెంట నడిచే మిత్రులనించి.

"గుడ్బై" అని ఆమె చెయ్యి వూపింది వాళ్లకి.

"ఎక్స్క్యూజ్ మి" అని లేచి నుంచున్నాడు, అతను ఆశ్చర్యపోతున్నంగా. స్టేషన్ దాటింది రైలు.

"ఏమిటది?" అన్నాడు అతను నవ్వుతో. ఆమె నవ్వింది.

"ఎక్కడికి?" అడిగాడు.

"మీ వూరు?"

"ఎందుకు?"

"పెళ్ళి కదూ!" అంది.

"ఎవరిదీ?"

"నీది, నాదీ" అని అతని చేతుల్లోకి వూగింది.

ఎందుకన్నా మంచిదని పేపర్లలో తలలు దూర్చుకున్న పెద్దమనుష్యులిద్దరూ తలెత్తి చూడకుండా వుండలేక పోయినారు

అతను ఆమె మాటలు నమ్మలేదు.

ఆమె ఆకారం మారింది. ఆమెనిచూస్తే మూడేళ్లు వెనకాల తిరిగినట్టుంది. కాలం - సరిగా అట్లానే రైలు. ఎదురుగా ఆ యిద్దరు పెద్దమనుషులు తప్ప.

అట్లానే అతని మెడమీద చేతులు వేసుకొని కూచుని నవ్వుతోంది అతని కళ్ళల్లోకి.

"నన్ను హాస్యం చేస్తున్నావు" అన్నాడు, ఆమె మెడకిందినుంచి తనని అలుముకునే గోరింట సెంటు పరిమళాలలోంచి.

"అవును" అంది.

ఆమెవంక ఆమె ఇంగ్లీషు సిల్కు వాయిల్ జాకెట్టు భుజాలవంక, ఆమె ఎర్రటినవ్వు, నల్లనిచూపులు, ఆమె పసుపు, నిడువూ చూస్తూ ఆమె తనతో తన

ఊళ్ళో, ఇంట్లో, గదిలో—యోచించుకోలేకపోయినాను.

ఆమెవంక చూస్తే చూపులతో చూపులు కలిసి మాట్లాడలేదు.

మూడేళ్ళకిందటమల్లేనే గుంపులు గుంపులుగా దీపాలు చీకట్లో గుడ్ నైట్ చెప్పి పరుగెడ్తున్నాయి రెండు వేపులా. పట్టాలు టపటపమని విడిపోయి కలుసుకుంటు న్నాయి రైలు చక్రాలకింద, వాళ్ళ జీవితాలమల్లే.

"నేను కనపడడం యాక్సిడెంట్ అవునా" అని అతని వెక్కిరింపు.

"అంతే అనుకో" అని ఆమె.

"కనపడకపోతే?"

"కనపడకుండా వుండవు."

"జైలునించి వొచ్చాక ఏమైనావు?"

"విడుదల ఐనాను."

"సరేలే నన్ను కలుసుకోలేదేం?"

"ఎందుకు?"

"నేను వెళ్ళాను – నీకోసం."

"అవును" అని ఆప్రేమను అంగీకరించినట్టు చేతిమీద వేళ్ళ వొత్తిడి.

"మరి నువ్వు!"

"వొచ్చానుకాదూ?"

"ఇన్నాళ్ళు..." ఇన్ని నెలల అతని బాధ – బైట పడనికోపం.

"ఇన్నాళ్ళు నన్నేం చేసుకుంటావు?" అంది.

అయినా ఈ ప్రశ్నలు ఎందుకు? కాని మళ్ళీ సత్యాగ్రహం ప్రారంభిస్తా మంటున్నారు నాయకులు.

"నీ ఖద్దరూ—దేశసేవా?"

"ఖద్దరు మానేశాను, గుచ్చుకుంటోంది. నిన్ను పెళ్ళిచేసుకుని పిల్లల్ని కంటాను, దేశానికి."

ఎదురుగావున్న పెద్దమనుష్యులు నవ్వు ఆపుకోడానికి న్యూసుపేపర్లు అడ్డం పెట్టుకున్నారు.

"ఇంక జైలుకి వెళ్ళవా?"

"ఊహూ"

"ఏమి?"

"నాకు ఆపేక్షలు లేవు."

ఎందుకీ ప్రశ్నలు, ఆమెను దగ్గరగా తీసుకోక! వాళ్ళిద్దరూ దిగిపోరా?

"ఈ సత్యాగ్రహంవల్లా, జైళ్ళకి వెళ్ళడంవల్లా, ఎన్నటికీ స్వరాజ్యం సాధించలేరు" అంది.

"ఎందువల్ల?" అన్నాడు కోపంగా, ఎదుటకూచున్న సూటుబాండు.

"ఆత్మశుద్ధి లేదు" అంది.

"అంటే?"

"ప్రతిఫలాపేక్షలు."

"అయితే నేం?"

"బ్రిటిషువాళ్లని వెళ్ళకొట్టే పద్ధతి ఆత్మబలం కద! జైళ్ళకి వెళ్ళడంలోంచి ఆత్మబలం రాదు" అంది.

"రాకపోతేనేం కొత్తగా?"

"నాతో జైలుకి వొచ్చిన నాయకుల్ని ఒకసారి చూస్తే తెలిసేది నీకు. ఒక సత్యంకోసం 'లా' ని ధిక్కరించే మనిషికి, 'లా' మీద యెంత గౌరవం వుండాలి! ప్రభుత్వాన్ని బైట యింత ధిక్కరించి, జైళ్ళల్లోకి వొచ్చి అక్కడ వీళ్ళ దేవురింపులు, లంచాలూ, మోసాలు! ఆత్మబలం అమ్మకానికి లేదు దుకాణాల్లో! బాంబుల్ని, రక్తపాతాన్ని, శాంతంతో, బలంగా, యెదుర్కోగల యోధులేనా తయారౌతున్నది!"

"వీళ్లని నమ్మి—అంటే, ఈ మనుష్యుల్లో యేదో గొప్పమార్పు తీసుకురాగలమని—ఉద్యమం సాగించడం మూర్ఖం."

"ఏం? తక్కిన స్వతంత్రదేశాల్లోని మనుష్యులికి తీసిపోతామా?" అన్నాడు, ఆ రెండో పెద్దమీసాల ఆయన.

"తీసిపోము. కాని మనమేదో ఆధ్యాత్మికశక్తో, ఆత్మబలమో చూపించగల ప్రత్యేక సమర్థులనుకోవడంలో వుంది మూర్ఖం. ఆ బలం సహజంగానో, సాధించో ఏ ఇద్దరు ముగ్గురికో వుండేమో దేశమంతా కలిపితే."

"ఐతే, యింక ఇంతేనంటారా?"

"ఏమో! సాయుధవిప్లవంతోనో, లేక వుత్త రక్తపాతం బలంవల్లనో, లేక ఏ ప్రపంచ పరిస్థితులవల్లనో, మన స్వతంత్రం మనకి రావొచ్చు. అంతేగాని ఈ సత్యాగ్రహంవ మాత్రమూ ఉపయోగం లేదు."

"ఐతే గాంధీగారు అంత మూర్ఖుడంటారా?"

"సందేహ మేముంది? ఇంకా అడుగుతున్నారా! మానవుడిలో, అతని సత్యస్వతంత్రాన్వేషణలో, ఆయనకి వున్న గొప్ప విశ్వాసం ఆయన బలం. కాని ఆ విశ్వాసం ఏ పదిమంది శిష్యులకో తప్ప ప్రజాబాహుళ్యంమీద పనిచేసి సద్యోఫలితాన్నిస్తుందని వాంఛించడం మూర్ఖంకాక ఇంకే మిటి?"

"ఏం? మన దేశపు ప్రజలు అంత పామరులనుకోను."

"ఉదాహరణ మీరిద్దరే" అంది కోపంతో వాళ్లని. అక్కడితో సంభాషణ పూర్తిగా ఆగిపోయింది

* * * *

అతని తమ్ముడూ, తల్లీ ఇష్టపడలేదు, అతను లాలసని పెళ్ళిచేసుకోడం కాని వొద్దని గట్టిగా చెప్పడానికి వాళ్ళకి అభ్యంతరమూ కనపడలేదు. పెళ్ళికిముందే అతని కుటుంబమంతా ఆమె ఇంద్రజాలానికి వశ్యులైనారు. కాని ఆ ఆకర్షణే వాళ్ళ లోపలి అనంగీకారానికి కారణం గావును! పెళ్ళి ముందు లాలస, స్వర్గంలో తేలిపోతున్న అతనితో—

"చూడు, నిన్ను పెళ్ళిచేసుకుంటున్నాననుకో. కాని నిన్ను తరవాత డిజప్పాయింటు చేస్తే నన్నేమనకూడదు" అంది.

"డిజప్పాయింటా? ఎట్లా?"

"నాలో ఏవేవో అద్భుత మహిమ లున్నాయని చాలా గొప్ప సౌధంకట్టి, దాంటో నన్ను పెట్టి పూజ చేస్తున్నావు. అవేం నాలో లేవు"

"నీ సంగతి నీకన్న నాకు బాగా తెలుసు. తరవాత?" అన్నాడు, డాబుగా.

"నేను చాలా విధేయతగల భార్యని కాకపోవొచ్చు."

"ఇంకా స్పష్టంగా మాట్లాడాలంటే, నేను నీకుఆదర్శమైన స్త్రీని అనుకుంటున్నావు. కాను. నమ్మవు. సరే నువ్వుమాత్రం నాకు ఆదర్శమైన పురుషుడివి కావు. మాటాడవేం? కష్టంగావుంది, ఔనా? మరి ఎందుకు నిన్ను పెళ్ళిచేసుకుంటున్నానా? ఆదర్శమైన పురుషుడు భూమిమీద లేడని నాకు స్పష్టమయింది గనక; నువ్వే నెక్స్టు బెస్టు. ఆదర్శమైనస్త్రీకూడా లేదు. కాని నేనొకతెను వున్నానని నమ్ముతున్నావు, దురదృష్టవంతుడివి. కనుక నువ్వు నన్ను డిజప్పాయింటు చెయ్యలేవు. నేను నిన్ను తప్పకుండా డిజప్పాయింటు చేస్తాను. ఆనాడు ఈ మాటలు నీకు జ్ఞాపకం వుండవు. కాని చెపుతున్నాను" అంది, చాలా సీరియస్‌గా. అతనికి భయం వేసింది.

"ఇది చెప్పు. పోనీ, లాలసా! నేను ఆదర్శం కాకపోతే నెక్స్టు బెస్టే కానీ, నామీద గట్టిప్రేమవుందా నీకు?"

"మరి నాకు నిమీద ఉన్నది ప్రేమే ఔనో కాదో, అది గట్టి ప్రేమో, వొదులు ప్రేమో, నాకు తెలీదు."

"వెక్కిరిస్తున్నావు" అన్నాడు.

"నిజం మాటాడుతున్నాను ప్రేమ అంటే ఏమిటో నాకేం తెలుసు? నాకు ఎవరిమీదా, నీ మీద ఉన్నంత ఇష్టంలేదు, ఈ నాటివరకు అదేదో కవులు పాడతారు,

చలం రాస్తాడు, చాలా పెద్దయెత్తున ప్రేమని గురించి. అది నాకు తెలీదు అసలు అల్లాంటిది వుందో లేదో చాలా సందేహం. వుంటే, అలాంటిది నా స్వభావానికిరాదో. మరి నీ మీదనో, యెవరిమీదనో ఒలాంటి ప్రేమో, వాంఛో, ఏదో వస్తుందో, రాదో నాకేం తెలుసు?"

"ఆడామ్స్."

"నిజమే, మరిచేపోయినాను. అంటే అది ఓ ముఖ్యం కాదన్నమాట. ఎందువల్ల అలా ఐనానో అప్పుడు! హాస్టల్ సూపరెంటెంటుమీద కోపంవల్లనో, ధిక్కారమో, లేక ఎడ్వెన్చర్ మీద ఇష్టమో, లేదో మరి! అప్పుడే మరచిపో యినాను."

"అడామ్స్ కోసం తపనపడ్డట్టు నామీద పడలేదు. రైల్లో ఆక్సిడెంటువల్ల కనబడ్డానుగాని, లేకపోతే నేను జ్ఞాపకం కూడా వుండివుండను జైలునించి వొచ్చాక."

"ఆగు. వెర్రివాడా! జైలులో అంతా నువ్వే నా మనసులో. జైలునించి వొచ్చాక నిన్ను కనిపెడుతోనే వున్నాను. నిన్ను కలుసుకున్నానా నా పనులకీ, నీ పనులకీ అడ్డు. అన్నీ సర్దేసుకున్నాను. ప్రయాణమై, నా సామాన్లు అనంతపురానికి బుక్ చేసి మరీ రైలెక్కాను నీతో. తృప్తి అయిందా?"

"సరేలే మరి నామీద నిశ్చయంగా..."

"నిశ్చయం అయిందాకా కాచుకునివుంటే, ఏదీ చెయ్యలేం చచ్చిందాకా. జీవితం అంటేనే రిస్కుతీసుకోవడం. ఒక్క చావే ఏ ప్రయత్నం, ఏ సందేహం. ఏ రిస్కు

లేకుండా నిశ్చయమైన విషయం జీవితానికి. పద, పెళ్ళిచేసుకుందాం?" అంది నవ్వుతో.

*      *      *      *

అనంతపురంకి బైటనించి ఎవరన్నా పేరుమోగిన ఆర్టిస్టు వొస్తే, అదొక వేలంవెర్రి. అతనికి చాలా గొప్ప గౌరవం జరుగుతుంది. మాల్యంకర్‌కి చాలా గొప్ప లక్షణాలు పట్టాయి. కోవా ముద్దలాగవున్నా, అదో విధమైన జారిపోయే అందం. ఏ సంగీత వాయిద్యాన్నైనా అవలీలగా మధురంగా వాయించ గలగడం, పాడడం, దేశంలో పేరు మోగిన నాయకుల, ఆర్టిస్టుల, రచయితల, సంగీతపాఠకులను అన్యోన్యంగా ఎగిరినట్లు కబుర్లు చెప్పడం, పైగా, బిలియర్‌డ్సూ, బ్రిడ్జీ నేర్పుగా ఆడగలగడం, ఊరంతా అతని మీద విరుచుకుపడ్డది. మకాం శేషాద్రిగారి ఇంట్లో. అక్కడే రెండు మూడు వాయిద్యగోష్టులు జరిగాయి. అందరూ చందాలువేసుకుని ఓ గట్టిపన్ను బహుమతికి ఏర్పాట్లుజరుగుతున్నాయి. మూడోసభకి స్త్రీలకి కూడా ఆహ్వానాలు వొచ్చాయి. ఇదివరకే అడుగుతోంది లాలస అతని పాట వినాలని. పూర్వం మద్రాసులోనే విందిట అతని కీర్తి.

...      ...      ...      ...

ఆ రాత్రి అతని కచేరి చాలా ఉత్సాహంగాజరిగింది. రాత్రి పదింటికి చేరినవాళ్ళు, తెల్లారకట్ట మూడింటిదాకా తన్మయులయి విన్నారు. ఈ లోపల గంధాలు, పువ్వులు, తాంబూలాలు, టీలు, మధ్యమధ్య ఆగి సంభాషణలు. ఆడవాళ్ళ సన్నిహిత ప్రభావంవల్ల అంత గొప్పగా పాడాడు

అన్నారు కొందరు కొంటెవాళ్ళు. పెద్దమనుషులు నమ్మడానికి నిరాకరించారు ఆ ఆరోపణని.

ఆ పాటకచేరికిముందే శేషాద్రి ఇంట్లో, క్లబ్బులో అతనికి బాగా పరిచయమైనాడు మాల్వాంకర్. అన్ని మంచి లక్షణాలున్నా అతనికి, స్నేహానికి తృప్తినియ్యలేదు అతని స్వభావం. ఎక్కడా యిబ్బంది అని చూసుకుంటే ఏమీ నిర్ణయంగా కనపళ్ళేదు. ఆ రాత్రి అతనూ, లాలసా అందరిలో మధ్యగా అతనికి ఎదురుగా కూర్చున్నారు. తక్కిన స్త్రీలు పురుషులకి వెనకగా పక్కగా చీకట్లో కూచున్నారు. అందువల్ల పాడుతున్న మాల్వాంకర్ కళ్ళు వారిద్దరిమీదనే నిలిచాయి అంతసేపూ. అతను అన్ని భాషల్లో, అన్ని రకాలైన కీర్తనలూ పాడాడు—భక్తీ, శృంగారం, దేశభక్తీ. అతను పాటతో వుంటే, అతనిలో ఎప్పుడూ వుండే గుణం, ఆ రాత్రి మరీ ఎక్కువగా తోచింది. వినేవాళ్ళని తన కౌగిలిలోకి, తన హృదయంలోకి పిలుస్తున్నట్టుగా వుంటుంది. అతన్ని ఆసమయాన ప్రేమించకండా వుండలేరు. ఆ విధంగా లాక్కున్నాడు వాళ్ళ ప్రాణాల్ని ఆ రాత్రి. లాలసలో చిత్రమైన ఆందోళన కనపడుతోంది. ఆమె లోపలికి గుండెల్లోకి చూస్తో, పీకుతో, పిండుతో పాడుతున్నాడేమో ననిపించింది. అలా లాగబడడం ఏమాత్రం యిష్టంలేదు ఆమెకి గాంధిగారి దివ్యపాశాలనించే తప్పించుకుంది తన స్వేచ్ఛకోసం. అతన్ని అంగీకరించింది గాని, తన వ్యక్తిత్వంలో అణుమాత్రం అతనికి వొప్పచెప్పలేదు. ఏ గొప్ప నిమిషాన కూడా, అతనిలో తనని మరిచిపోలేదు. అతనికి తనని సంపూర్ణంగా ఇచ్చుకోలేదు. అలా ఆ మాల్వాంకర్ సంగీతం తనని

గుంజుతో వుంటే, మొదట ఆశ్చర్యం, భయం, తిరుగుబాటు ఆమె కళ్ళల్లో. పెద్ద యుద్ధం ఆమెకీ మాల్వంకర్‌కీ ఆ రాత్రి ఆమెని, ఇంటికి తీసుకుని వెళ్ళిపోవాలని తాను ప్రయత్నించాడు. ఆమె తన మాటనికూడా వినిపించుకోలేదు. జడిసి పరిగెత్తడం ఆమె స్వభావంలో అసలులేదు. లాభంలేదని గతిలేకే వూరుకున్నాడు. మరి ఓ అరుపు అరిచి ఆ మాల్వంకర్ నెత్తిమీద ఓటి పెట్టి బైటికి తరమవలసింది, సరైన మొగవాడైతే. కాని నాగరికత, మర్యాద, అట్లా చేస్తోంది మనుష్యుల్ని. తమ సౌఖ్యంకన్న, ప్రాణంకన్న, ప్రేమకన్న, మర్యాద ముఖ్యమయింది.

కచేరి కాగానే, అతనూ లాలసా లేచారు. మాల్వంకర్ ఎస్. రాజ్‌ని కింద పెట్టి, చేతులు దులుపుకుని వాళ్ళవేపు వొచ్చాడు, యక్స్పెక్టెంట్ స్మయిల్ చిరునవ్వుతో. ఏం చేస్తాడతను ? 'చాలా గొప్పగా పాడారు' అన్నాడు, ఆ మైదానుద్దకంఠం నులిమేయాలన్నంత కోపంతో.

"ఆమె ఏ మంటారు ?"

ఆమె మాట్లాడలేదు. తల వంచుకుంది, ఎక్కడా, యెన్నడూ తల వొంచని లాలస.

"ఏమీ బావుండలేనట్టుంది."

యింకా మాటాడలేదు. సింగు చేతిని పట్టుకుని మాల్వంకర్ వేపు వీపు తిప్పింది.

"అయితే, ఆమెకి నచ్చేట్టు ఇంకోసారి ఆమె సమక్షానికే వొచ్చి ప్రత్యేకంగా ఆమెకే పాడాలి" అన్నాడు.

"వెళ్ళిపోతున్నారుగా ?" అంది ఆమె.

"వెళ్ళను. మీకోసం ఆగిపోతున్నాను."

"అదేమిటి ? బళ్ళారిలో శివరావుగారు మీ కోసం చూస్తో వుంటారు. కైలాసం రాశాడుకూడా మీ కోసం ఆగానని" అన్నాడు సింగు.

"శివరావు, కైలాసం! ఆగనిండి" అన్నాడు నవ్వుతో మాల్వాంకర్. యెంత యెకిరింపు నవ్వులో !

రెండడుగులు నడిచారు రోడ్డుమీద సదరన్ క్రాసు వేపు చూస్తో.

"రేపు వొస్తాను" అని వెళ్ళిపోయినాడు మాల్వాంకర్. ఆ రాత్రితో తనకీ లాలసకీ మధ్య యెన్నడూ దాటలేని అగాధం ఏర్పడిం దనిపించింది.

మర్నాడు సాయంత్రం అతను కోర్టునించి వొచ్చేటప్పటికి అతనిమీద అమితమైన భక్తిగల తమ్ముడు మాధవ భయపడుతో, జంకుతో అన్నాడు :

"అన్నయ్యా, మాల్వాంకర్ వొచ్చిపాడాడు ఈవాళ."

"అవును, వొస్తానన్నాడు."

"నువ్వు లేనప్పుడు !"

ఏమిటో వేదన అతనిలో! అతన్ని కావిలించుకుని ఓదార్చా లనిపించింది.

"లేకపోతేనేం ?" అన్నాడు తన కష్టాన్ని దిగ మింగుకుంటో.

"మీరందరూ ఉన్నారుగా ?" అన్నాడు మళ్ళీతను.

"వున్నాం. అందరం కూచున్నాం అమ్మకూడా."

కొంచెం వాయించి "నాకు సరిగా కుదరటం లేదు. మీ రందరూ వెళ్ళిపోండి" అన్నాడు వాడు.

"పోనీలెండి. ఈవాళ మీకు సరిగా కుదరటంలేదు. అన్నయ్య ఉన్నప్పుడు రండి" అన్నాడు చిన్నన్న.

"కాదు ఆమెకోసమే వినిపించడానికి వొచ్చాను" అన్నాడు.

"ఒదిన మాట్లాడలేదు. వాడూ కదలలేదు. మేమూ కదలలేదు."

"వెళ్ళమనలేదా ? ఇదేం సంగీత మనుకున్నారా ? లాలిపాట లనుకున్నారా ?"అని తగాదా ప్రారంభించినాడు.

వొదిన లేచి తన గదిలోకి వెళ్ళిపోయింది. సభ అయిపోయిందని మేమూ వెళ్లాం అతన్ని అక్కడేవొదిలి... కాసేపటికి వొదిన గదిలోంచి సంగీతం వినపడ్డది. నీ గది లోంచే అన్నయ్యా !" అంటో ఏడుపు దిగమింగుకున్నాడు మాధవ.

ఏమంటాడు తను ? తన మొహం కనపరచక, "ఉ" అని వెళ్ళి పోయినాడు. రోషం, కోపం, బాధ !

కిటికీలోంచి బయటః చూస్తో తలన్నా తిప్పి చూడ లేదు లాలస.

"మాల్వాంకర్ ఈ గదిలోనే సభ చేశాట్టగదూ?"

"గుమ్మంలోనే వొచ్చిందా ఫిర్యాదు?"

"మర్యాదైన పనికాదు లాలసా?"

"మర్యాదకన్నా ముఖ్యమైన విషయాలున్నాయి జీవితంలో."

"సంగీతమా?"

"అనుభవం!"

"ఏం అనుభవం?"

"గాఢమైనది ఏ అనుభవమైనా సరే!"

"ఇక్కడ ఏ అనుభవం?"

మాట్లాడలేదు.

ఆ రాత్రి మామూలు ప్రకారం తనకి వొళ్ళిచ్చింది. కాని దాంటో ఇదివరకు వున్న కొంత సరదాకూడా రాత్రి లేదు.

మర్నాటినించి ప్రతిరోజూ వొచ్చి తన గదిలో లాలసకి పాడుతున్నాడు మాల్వాంకర్.

ప్రతి సాయింత్రం తమ్ములు గోల. తన తల్లి కన్నీళ్ళ మౌనం. ఈ విషయం మూడురోజుల్లో ఊళ్ళో పాకినట్టు తనకి తెలుస్తోంది. అదే అన్నారు అతని తమ్ములు.

"అన్నయ్యా రేపువాణ్ణి చితకపొడవతలుచుకున్నాం."

"తొందర పడుతున్నారు. ఎందుకు అంత కోపం తెచ్చుకోవడం?"

"ఏమిటా పని వాడు ?"

ఆ వ్యవహారంలో అంతాకూడా మాల్యాంకర్ నే తిట్టారు. తల్లీ, తమ్ముడుకూడా లాలసని వొక్కమాట అన లేదు. మరి వాళ్ళ మనసుల్లో ఏముందో! కాని వొదిన వాళ్ళకి తల్లితో సమానం.

మనుషులు బైట యెంత మారనీ, ఈ దేశంలో, ఇంటో తల్లీ, కొడుకూ, అన్నా, వొదినా, అన్న భక్తీ, గౌరవం ఈ సెంటిమెంట్లు బలీయం.

వాటిని అర్థం లేనివని యెక్కిరిస్తాడు, తెలుగురాసే చలం అనే అతను.

"మీ రెందుకట్లా అనుమాన పడతారు ?"

"నీకు లేదా అన్నయ్యా ? పోనీ అనుమానపడడం అన్యాయమేనంటావా ?"

ఏమంటాడు తాను !

"పోనీ వూళ్ళో పుకార్లు ! యెట్లా ఇంకోళ్ళ మొహం చూడడం ? ఇట్లాంటి తమ్ముళ్లని పెట్టుకుని నీ కేమిటా ఖర్మం, భయం ?"

"వొదిన ఇష్టపడుతుందో లేదో ?"

"ఇది ఆడవాళ్ల వ్యవహారం కాదు !"

ఆడవాళ్ళు అనే హద్దులుకూడా తీసెయ్యా లంటాట్ట చలం. కాని లాలసే తీసేసింది ఆ హద్దు.

"ఈవాల్టికి ఆగండి సరేనా ?"

గదిలోకి వెళ్ళి లాలసతో "నీ మిత్రుడితో చెప్పు, అతన్ని తంతారుట మాధవా వాళ్ళు" అన్నాడు.

"అవును ఇంక నేనే వెళ్ళాలి" అంది. అట్లా అంటుంది అనుకున్నాడు తను. ముందే అనిపించింది. ఆ మూడు రోజులనుంచి మాటలులేవు అతనికీ, లాలసకీ. ఏమిటా, ఏం చెయ్యాలా, అనే తన యోచనకి నిర్ధారణ లేదు.

"కలుసుకోడం తప్పదన్న మాట" అని క్లబ్బుకి వెళ్ళిపోయినాడు. క్లబ్బుకి అప్పుడప్పుడుగాని వెళ్ళటంలేదు అతను. క్లబ్బుకి వెళ్ళి మాల్వాంకర్‌తో చెపుదామనుకున్నాడు. తన తమ్ములు తన్నదలుచుకున్నారని. కాని విధి, వ్యవహారం తన సొంత చేతుల్లోకి తీసుకుంది. లాలస అట్లా అయిన తర్వాత, వూళ్ళో అంత నిందపడి ఇంకా అట్లా యెట్లా వుండగలిగానా అని అతనికి ఆశ్చర్యం ఈనాడు.

క్లబ్బు తోటలోకి వినిపిస్తోంది, వరండాలో చీట్లపేక ఆడుతున్న మాల్వాంకర్ కంఠం.

"బళ్ళారినించి వెంటనే రమ్మని" అన్నాడు, అప్పుడే వొచ్చిన టెలిగ్రాం చూసి గావును మాల్వాంకర్.

"చాలా అందమైన చేతులు అడ్డు పెడుతున్నాయి, అని జవాబియ్యి" అని ఓ డాక్టరు.

నవ్వులు. సింగుర క్తం ఆగింది, స్తంభించిపోయినాడు.

మాల్వాంకర్ "చస్ ... (పెద్ద అసహ్యాపు బూతు మాట). అందులో ఇది మరీ"...బూతుమాటే మళ్ళీ.

చ(క్రమని నడిచి తోవతిరిగి యెదురుగా వెళ్లి మాల్వాంకర్ని చంపమీద కొట్టాడు. కుర్చీతో సహా అతను కింద పడ్డాడు. మిత్రులు అడ్డం నుంచున్నాను. అనవసరం. ఆ మాల్వాంకర్ యెన్నడూ చేతులతో తనని ఏమీ చెయ్యలేదు, తన భార్యనేగాని. మాల్వాంకర్ లేచి రోషంతో చూస్తో నుంచుని "అనుభవిస్తావు" అని గొణిగాడు.

సింగు చప్పున వెనక్కి తిరిగి ఇంటికి వెళ్ళిపోయినాడు. చాలా సంతోషంగా వుంది అతనికి, తను చేసిన పని. అతనన్న బూతుమాట లాలసతో చెప్పాలి. దాంతో నిజం తెలుస్తుంది. సంగీతం మాయ విరిగిపోతుంది. కాని యెట్లా ఏ అసభ్యమూ పలకని తాను, అందులో లాలస ముందు ఆమాట అనడం? తను కొట్టింది చాలదా? వాడు ఇప్పుడు ఇంక వూళ్ళో నిలవలేడు, పోతాడు. తన తమ్ముల కి శ్రమ తప్పింది. కాని తను కొట్టానంటే, లాలస ఏమంటుందో!

సరే వాడు వెడతాడు. కాని ఇదివరకు తమ మధ్య వున్నసామరస్యం పోయిం తరువాత, లాలసతో ఇంక ఏదో భార్యకిందనేగాని – తన గర్వం, తన సంతోషం, ఆమె వుందనే ధ్యాసతో మాధుర్యం – ఇంక ఏమీ మిగలవు. సరే ఆలోచనలన్నీ తరవాత. ముందు వాణ్ణి పంపించాలి. కోర్టుకి వెడతాడా? వాడా? వాడు ఎన్నటికీ వెళ్ళడు. వెళ్ళనీ! వెడితే ఇంతకన్న ఏమవుతుంది?

మళ్ళీ విధి వ్యవహారాన్ని తన సొంత చేతుల్లోకి తీసుకుంది.

ఆ ఆలోచనలతో యెంతసేపు తిరిగాడో తన ఇంటి గేటుదగ్గిర వున్నాడు. గేటుముందు కారు నిలిచి వుంది. యెవరో వొచ్చారు. తన కోసమా ? ఈ స్థితిలో యెట్లా తను మాట్లాడడం ? ముందు లాలసని చూడాలి. దొడ్డి గుమ్మంలోంచి మేడ యెక్కితే సరి. అని ఇల్లు చుట్టాడు. చెట్ల వెనక చీకట్లోంచి మాటలు !

"నేను రాను, వొదులు."

లాలస కంఠం - పెనగులాట - ఆయాసపు నిశ్వాసాలు !

"నోరు మూసుకుపద. చంపు తాను" (అని చిన్న బూతు) మాల్వంకర్.

లాలసనించి నవ్వు. ఒక్క నిమిషంలో జీవితంలో తను చేసిన గొప్ప తప్పును గ్రహించాడు సింగు- భార్యని ఆరాధించడం. ఎంత గౌరవం, భక్తి తనకి !

మాట్లాడకండా వెళ్ళిపోవాలా తను ?

"వుండమంటే. అతనితో చెప్పి వస్తాను రేపు."

"వీల్లేదు, వెళ్ళనీరు. పదవే లం..."

రక్తం విషయమయింది. టార్చిలైటు వేశాడు వాళ్ళమీద. ఎందుకో ? అట్లాంటి సమయాల్లో ఎందుకు ? ఏం చేస్తామో ?

మాల్వంకర్ లాలస మెడదగ్గిర బాడీస్‌లో ఓ చెయ్యి వేసి మోటుగా లాగుతున్నాడు. వెలుతురు మీద పడేప్పటికి వొదిలాడు.

ఆమె జుట్టు విడిపోయింది. జాకెట్టు చిరిగిపోయింది.

అతను వాళ్ళదగ్గిరికి వెళ్ళాడు లైటువేసివుంచి. ఆమె పెదవి రక్తం కారుతోంది.

"రా" అన్నాడు లాలసని. ఆమెని నిస్సహాయంగా మాల్వంకర్ పాల వొదిలినందుకు పశ్చాత్తాప పడుతున్నాడు సింగ్.

వొచ్చేసింది.

గదిలోకి వెళ్ళాక అతను మనసుని చాలా సర్దుకుని "ఏమిటి లాలసా ఇది ? ఇంతేనా ఇంక" అన్నాడు.

ఆమెని కొట్టాలనీ, చంపాలనీ ఆ మంచంమీాద తోసేసి, బూతులతో, కసితో తన జెలసీ ఆమె వంటిమీాద తీర్చుకోవాలని వొచ్చే వుద్రేకాల్ని అణచుకుని అడిగాడు ఆ మాట.

"అవును. ఇంక వీల్లేదు. నేను వెళ్ళిపోతున్నాను."

"అతనితోనా ?"

"ఏట్లోకి. ఎవరితోనో ఒకరితో వెళ్లిపోతున్నాను. ఇంక నీకెందుకు ?"

"అసలు ఏమిటి ? నాదా లోపం, నీదా? లేక అతని మీాద అణచుకోలేని కోర్కా !"

"ఏదైతేనేం ? నా తల తిరిగిపోతోంది. నాకు తెలీదు. విడమర్చి చీల్చి, తర్కించి తెలుసుకునీ, ప్రయోజనం లేదు అంతే."

"అతను నిన్ను చాలా గౌరవంగా, ముద్దుగా..."

"పూరుకుందూ, నీకేమీ తెలీదు."

"అతనిలో నమ్మకమా నీకు ?"

"లేదు."

"ఐతే ?"

"నీకెందుకు ? పూరుకో."

ఇంక మాట్లాడడం గౌరవహీనమనిపించి పూరుకున్నాడు. కదలడానికి శక్తిలేకుండా కాళ్ళూ చేతులు విరిగేట్లు ఆ రాత్రి ఆమెని తంతే ఏం జరిగేదో ! కాని లాలసని తన్నలేదు. తన్ని, తనని తాను భరించుకోలేదు. తన్నలేక పోవడమే పురుషుణ్ణి నేడు స్త్రీ కళ్ళల్లో అంత చవక చేసింది అనుకుంటున్నాడు ఈనాడు. పైగా ఆమె వెళ్ళిపోవాలనే వుంది తనకి ఆనాడు. ఆమె శరీరాన్ని బాధపెట్టడమే!ఎంతైనా కోపం వస్తుంది. చంపాలనిపిస్తుంది, కాని ఆకోపం తన చేతుల్లోకివచ్చి ఆమె అందమైన వంటిమీదికి పోదు. ఇంక అయిష్టంగా, విధికింద కసాయివాడిలాగా ఎలా కొట్టగలడు ?

మర్నాడు పొద్దున్న తన తమ్ములిద్దరూ దగ్గిరికివచ్చి నుంచున్నారు. భీమార్జునులలాగు.

"వెళ్ళిపోతుందిట. అతనితో."

"ఏమిటి ?" అని అరిచారు వాళ్ళు.

ఆకాశం విరిగిపడ్డది వాళ్ళమీద.

"వోస్తాడూ వాడు ఈనాళ ?" అన్నాడు మాధవ.

"ఏమో !"

"రానీ !"

"ఈమే వెళుతుందేమో!" పెద్ద తమ్ముడు అన్నాడు.

"వెడితేనా? ఏమిటి? ఆ వెధవ, మన వదినని తీసికెడ తాడా? చూద్దాం" అని వెళ్ళిపోతున్నారు.

"వెళ్ళనీండి."

వాళ్ళ చెవుల్ని వాళ్ళు నమ్మలేక పోతున్నారు.

"నాకు లాలస వెళ్ళిపోవాలనే ఉంది" అన్నాడు సింగ్

"అపరిదిష్ట."

"ఇప్పటికంటేనా ?"

"ఏమిటి అన్నయ్యా !"

"ఇంక మాట్టాడకండి. నేను మద్రాసు వెడుతున్నాను. మీరు లాలసని అభ్యంతర పరచకండి. వాగ్దానమేనా ?"

దొంగని కరవకండా కట్టేసిన జాతి జాగిలాలమల్లే అయినారు వాళ్ళు.

అంతే తను బెంగుళూరు వెళ్ళాడు. రెండోరోజుకి ఉత్తరం వచ్చింది. లాలస మాల్వంకర్‌తో వెళ్ళిపోయిందని.

నిదానంగా యోచించుకుంటే అసలు పెళ్ళి ముందు ఆమె మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఆ మాటలు వెళ్ళిపోయే ముందు తన మొహాన విసరకపోవడం ఆమె ఔదార్యం.

మూడు నెలలలోనే మాల్వంకర్ని వొదిలిందని తెలిసింది. లేక మాల్వంకర్ వదిలాడో? తనకి ఉత్తరం రాసింది అప్పుడే.

మరి ఇప్పుడు భీమ్లాలీ ఎలావుంది? ఏం చేస్తోంది ? లాలసేనా ! ఎలా తెలుస్తుంది తనకి.

మర్నాడు సాయంత్రం బీచిమీద దేశికాచారిని కలుసుకున్నారు.

"నాతో చెప్పకుండా యెందుకు వెళ్ళారు అంత దూరం నిన్నసాయంత్రం ? చాలా భయపడిపోయినారుగా?" అన్నాడు.

ఇతనికెట్లా తెలుసు?

"ఏం భయంలెండి? ఏం ఫరవాలేదు. చీకటి గనకా, కొత్తగనకా" అని కోశాడు నరశింహారావు.

"ఆమె అక్కడ వుండబట్టి సరిపోయిందిగాని" అన్నాడు దేశికాచారి.

"ఎవరామె?" అన్నాడు సింగు.

"తెలుసుగామీకు, నా భార్య."

"ఆమె దేశికాచారి భార్యా! ఆమె లాలసయేమో ననుకొని తానెంతో ఆశపడ్డాడు?

"ఆమెపేరు?"

"తెలీదు నాకు."

"తెలీదేమిటి?"

"అదోకథ"

"ఆమెని ఏదో పిలుస్తారే మీరు?" అన్నాడు నరసింహారావు.

"లాల్ అంటాను. కాని అది ఆమె పేరుకాదు."

సింగ్ మూలిగాడు.

ఇంకేమడుగుతాడు?

ఇంతకీ ఆమె లాలస అవునా కాదా అనే జిజ్ఞాసలో పడ్డాడు సింగు.

సరే, ఆమె లాలసే అనుకుందాం, లాలసేఐతే తన

ఉద్దేశ్యం ఏమిటి? తనతో వొచ్చి మళ్ళీ కాపరం చేయించు కోవాలనా? ఆమె వొస్తుందా? ఆ ప్రశ్నలకి అతనికి సరైన సమాధానం దొరకలేదు. ఎవరైతేనేం, తనకి సంబంధం లేదని, ఒదిలి పోకూడదా? పోలేడు. ప్రపంచం లోని గొప్ప అనుబంధాలన్నీ అంతే. వాటికి కారణం, తెలివీ, అర్థం ఏమీ కనపడవు. ఎంతెంత వివేకవంతులూ ఆవిషయంలో వృత్తమూఢుల్లాగు ప్రవర్తిస్తారు. కాని పైకి మూర్ఖంగా కనపడే ఆ మనసులో పట్టుకి, తక్కిన జీవితంలో పనులన్నిటి కంటే, ఎక్కువబలం, ఎక్కువ అర్థం, ఎక్కువ సాఫల్యం— అది జాడ్యంకానీ, పూర్వజన్మ సంబంధంగాని, ఈశ్వరాజ్ఞ కానీ, ఉత్త పిచ్చికానీ.

లాలసని చూడాలి. మాట్లాడించాలి. ప్రయత్నం తప్పదు. ఆమె లాలస కాదని తెలిసిందాకా, లాలస విషయం లో తాను పొరపాటుపడడు. మరి లాలసే ఐతే తనని గుర్తు పట్టలేదా ఇంతవరకూ? లాలసే ఐతే ఎప్పుడూ స్నేహాన్ని, మనుషుల్నీ, స్వేచ్ఛనీ, కోరే లాలస, ఎవరికీ కనపడక వొంటరిగా ఎట్లా వుండగలుగుతోంది? అబద్ధమూ, మోసమూ ఏకోశానా సహించలేని లాలస దేశికాచారిని ఎలా భరిస్తోంది? ప్రేమిస్తోందేమో కూడానూ? తనని వొదిలిన స్త్రీ ఐనా, తాను వొదిలిని స్త్రీ ఐనాసరే, నాశనమై పోక, స్థిరంగా సుఖంగా ఒక విధానంలో బతుకుతో వుండడం కళ్ళారాచూసి భరించగలిగినవారు చాలా కొద్దిమంది. సంతోషించ గలిగినవారు అసాధారణ వ్యక్తులు.

ఆనాటి సాయంకాలం బీచివొడ్డున చాలామంది

చేరారు దేశికాచారిచుట్టూ దేశికాచారి చాలా మంచి ఫారమ్‌లో వున్నాడు లెక్చరిస్తున్నాడు తాను యుద్ధంలో తిరిగిన మెసపటోమియా, ఈజిప్టు దేశాల్ని గురించి. అప్పు డప్పుడు విన్నాడు సింగ్ అతని నించి చూచాయగా పర్షి యాలో రాచకుటుంబపు సుందరితో ఎడారిలో అతను నడి పిన రోమాన్సు ఆ జ్ఞాపకం అతని జీవితంమీద ఒక వెలుగూ ఒక నీడకూడా అంటాడు. ఇంకా ఆ విరహం అతన్ని వొదల లేదు.

పడమటి కొండవెనక అస్తమించే సూర్యుడి వెలుగు కొండ పక్కలనించి తప్పించుకుని, గొప్ప చక్రవర్తి వెనక వేళ్ళాడే రత్నాల క్లోకని సూచిస్తోంది. ఎందుకిట్లా నిరంతరం కొట్టుకుంటావని కొండ సముద్రాన్ని ప్రశ్నిస్తోంది. పర్వతం వెనకనించి వొచ్చేకాంతి సందేశాన్ని అందుకుని కట్టేసిన ఆడసింహం మల్లే దూకుతోంది సముద్రం పర్వతంవేపు. అతి భీషణంగా, అణుచుకోలేని రక్తపు ఉధృతంతో.

దేశికాచారి వర్ణించే అరేబియా యువతుల విగ్ర హాల పటిమా, మోహాకారిత్వతా, ఇటో అటో నిమిషంలో ప్రాణాలు ఒడ్డి తేల్చుకునే సాహసమూ, వింటో సింగ్ చాలా తబ్బిబ్బైనాడు లాలసవంటి స్త్రీని నిలుపుకోలేని తన బలహీనం, వ్యక్తిస్వేచ్ఛ అనీ, న్యాయమనీ, హృదయ సౌకుమార్యమనీ, ప్రేమలో ఉదారత్వమనీ తర్కించుకున్న తన చేతగానితనంమీద అసహ్యం వేసి గుంపులోంచి చర చరా నడిచాడు కొండవేపు వొంటరిగా.

లాలసని చూడాలి. ఆమె లాలసో కాదో తేల్చుకో

వాలి. తరువాత ఏమౌతుందో తరవాత కథ! రెండూ, మూడూ అని లెక్క పెడుతోవుంటే ఉత్త లెక్క లేగాని, అసలు వస్తువులు ఎన్నడూ చేతికి దొరకవు

వెళ్ళి ఎట్లా ఎక్కడ? ఏం మాట్లాడాలి? ఆలోచించ కూడదు. ఆలోచనే అన్ని సందేహాలకీ మూలమన్నాడు హామ్లెట్. తన సందేహాలతో తనని తనే చంపుకున్నాడు అంత ఉత్తముడూ.

అతని వెనకనించి వెంట వొస్తానననే పెద్దఅలల్నీ, ఏమిటీమనిషి ఇట్లా పరుగెత్తుతున్నాడని తొంగిచూసే పురాతన వృక్షాల్నీ; ఏ సమస్యలూ లేకండా గుడిశలకి వెలుతో పాటలుపాడే పాటకపు యువకుల్ని కన్నెత్తికూడా చూడ లేదు అతను.

బంగళాముందు తలుపు వేసివుంది. చుట్టూతిరిగి వెనక నించి వెళ్లాడు. వొంటింటో వుంటుంది రాత్రికి దేశికాచారికి రుచిగా వొండిస్తో, తన లాలస.

నౌకర్లో! ఏమో! వుండనీ.

సంపెంగ పరిమళాలు, ఆకుల్ని గలగల లాడించే ఏడు వూర పిచికలు, వెళ్ళిపోదామా అని యోచిస్తూన్న గిజిగాడు, ఎవరని పెద్దకళ్ళతో ప్రశ్నించే నల్లమచ్చల ఆవు. అతని నడకకి రేగిన తేనెతుట్టె, ఇవన్నీ మనసువెనక ఎక్కడో.

పట్టు తివాసీలు పరిచిన మెట్లు, వంటిల్లు వరండా, లేదు. అక్కడ లేదు. వుంటే ఆ చుట్టుపక్కల ఆ శూన్యం కనపడదు. చూశారా నౌకర్లు? చూడనీ.

ఇంకా లోపలికి. చీకటి, కుర్చీలు, సితారు. అవసీం

్రదనాథ్ ఉమ పటం పెద్దది తనఎదట. ఆగిపోయేవాడే ఇంకోప్పుడైతే. పక్కనగది పడకగది కాబోలు. నీలం తెరలు తొలిగించి లోపలికి వెళ్లాడు.

కిటికీలోంచి సముద్రవంక చూస్తో ఆమె. ఆమె చేతులో పుస్తకం. స్ట్రేబర్డ్సు-రవీంద్రనాథ్ టాగూర్, అనే బంగారు అక్షరాలమీద సముద్రనించి పచ్చని వెలుగు సరాసరి వెళ్ళి ఆమె చేతుల్ని పట్టుకున్నాడు. పుస్తకం కింద పడిపోయింది, హడలి, చేతుల్ని వొదిలించుకుని నుంచోడం ఒక్కనిమిషం, ఈ లోపలే.

"లాలసా!"

"ఏమిటటి?"

"లాలసా? లాలసా నువ్వు లాలసవి, కాదనకు."

రెండు నిముషాలు నిశ్శబ్దం, అతను ఆమె కళ్ళల్లోకి చాలా సస్పెన్సతో చూడడం, జడ్జీనించి మరణశిక్ష పడు తుందా అని చూసే నిర్దోషిమల్లే, రెండు నిమిషాలు. జీవి తాన్ని-అమూల్యమైన జీవితాన్ని, ఇంక మళ్ళీ రానికాలాన్ని ఎటు తేలుస్తాయో అనే గాఢమైన నిమిషాలు. అనంతమైన నిమిషాలు అతనికి.

"లాలస! లాలస ఎవరు? ఏమిటిది? ఎవరుమీరు?"

"నేను తెలీదా? పోస్సి అవాళ మొగలి పొదదగ్గిర మమ్మల్ని రక్షించిన..."

"వారా మీరు? ఐతే? లాలస ఏమిటి?"

"లాలస కాదా నువ్వు?"

"లాలస ఏమిటి?"

"నీ పేరేమిటి?"

"అప్రస్తుతం. నేను లాలసని కాదు."

అప్పుడు చూశాడు ఆమెవంక.

అప్పుడు సరిగా విన్నాడు ఆమె మాటల్ని. ఆమె లాలసే ఐతే చాలా మారిపోయింది. కాదు. లాలసకాదు. ఎంతో నిదానం, ఆమె మొహంలోనే కాదు_ఆమె దేహం లోంచి, బధ్ధకం, అన్నీ వొదిలేసుకున్నతనం. లాలస చురుకైన మెరిపించే అందం. తనభర్తప్ప తక్కిన ప్రపంచం లెక్కలేదన్న ధిక్కారం, ఏమీలేవు ఈమెలో. కాని శాంతి. ఈమె ఇంటో వుంటే చుట్టూ శాంతి. పిట్టలకూతలు, ఆవు అరుపు, వంటింటో గిన్నెల చప్పుడు, గాలి కదిలించే పరదాల ఊడ్పు, దూరంగా సముద్రపు హోరు, విచ్చుకునే చంద్రకాంతుల శాంతి_అన్నీ శాంతి. సగం కనపడుతున్న ఆమె వక్షంమీద తల నానించుకుంటే ఏ హృదయానికైనా లోపల్నించి నిదానమైన శాంతి, ఆమె హస్తాలే ప్రేమిస్తే గొప్ప సుషుప్తి.

ఇవన్నీ ఆ నిమిషాన అతనిలో పలికాయి. తరవాత ఇంటికి వెళ్ళాక ఆలోచనలైనాయి అవి.

నిదానంగా సముద్రంవంక చూస్తో ఆమె కూచుంటే, ఆమె కళ్ళలోకి చూస్తో తననే మరిచిపోతాడు మానవుడు.

"లాలస కాదా? పొరబడ్డాను. క్షమించండి."

"మరి ఇంక వెళ్ళండి."

"ఎట్లా వెళ్ళను? ఇట్లాంటి దౌర్జన్యం చేసి?"

నవ్వింది.

"చాలదా? ఇంకా ఎందుకు?" అంది.

"ఇంకా దౌర్జన్యమా? సిగ్గుపడి చచ్చిపోతోవుంటే! ఏం లేదు, మీకు నా పశ్చాత్తాపం తెలపాలని.

"పశ్చాత్తాపం వుత్తమోసం..."

"చాలాఅన్యాయంగా, కోపంగా మాట్లాడుతున్నారు. నేను నిజంగా..."

"మిమ్మల్నన్నటం లేదు. లోకంలో అంతా అంతే."

"ఇంక సూనృతులు లేరంటారా?"

"పశ్చాత్తాపం లేకపోవడం సూనృతమే. వుందనడమే మోసం,"

"అందరూ అంతే?"

"అంతే .. సరేలెండి. ఇట్లా ఈ గదిలో నాకేం బాగాలేదు. వెళ్ళండి."

"బైటకూచుంటాను, వొస్తారా?"

"ఎందుకు? అవసరంలేదు."

"అట్లాకాదు..."

"మీరు వెళ్ళండి" కఠినంగా.

"మీకు కోపం పోలేదు."

"పోయింది. పోకపోతే, మీరు పోగొట్టలేరు."

"శలవు."

గది బైటికి వొచ్చేశాడు. చాతనైనంత డిగ్నిటీతో, వొచ్చి ఒక్క నిమిషం అగి నుంచున్నాడు. వెళ్ళలేక పోయి నాడు. ఆమె లాలసకాదు. పరజాలు తొలిగించి మళ్ళీ లోప

లికి వెళ్లాడు. ఆమె టాగోరు పుస్తకం తెరిచి సముద్రంవంక చూస్తోంది, ఆ నిమిషంలోనే అతను అసలు రానట్టే.

"క్షమించండి. ఒక్కమాట. మీరెక్కడా ఎవరికీ కనబడరేం?" అన్నాడు.

"అనవసరం."

"ఏది అనవసరం? కనబడడమా?"

మాట్లాడకండా చూసింది.

"చాలా గొప్పశక్తి నన్ను ఆకర్షిస్తోంది. నన్ను తప్పు అర్థం చేసుకోకండి."

"తప్పు అర్థం ఏమిటి?"

"మీపైన కాంక్ష అని."

"అదిమాత్రం తప్పు అర్థమేముంది?"

"ఆగిపోయి తరవాత మాటలకి తడుముకున్నాడు. ఆమె మాటలకి అర్థం? కోరడం తప్పు కాదనా? లేక కోరిక ఉందని తనకి తెలుసుననా?

"మీరు చాలా దగ్గరగా లాలసని జ్ఞాపకం చేస్తున్నారు."

"పోయిన లాలసని పోనీక, మళ్ళీ ఎందుకు తవ్వుకుంటారు? మూర్ఖమైన శాధ" అని జాలిగా నవ్వింది పడుకునే.

ఆ నవ్వు లాలసే, ఆమే.

చప్పున దగ్గిరికి వెళ్ళి మోకరించాడు ఆమెవేపు చేతులు జాస్తో.

"లాలసే. నువ్వు లాలసవే—నన్ను వేధించకు. అన్నీ మరిచిపో. నేను..."

నిదానంగా పుస్తకంమూసి లేచి నుంచుంది ఆమె. అతనూ లేచాడు. నవ్వుతో అతని చేతిని పట్టుకుంది ప్రేమగా.

"లాలసా నా లాలసా!" అని కావిలించుకోబోయి నాడు.

"ఉండండి" అని అతని చేతిని పట్టుకుని పక్కహాలు లోకి తీసికెళ్ళింది. బైట తలుపు తెరిచి వరండాలోకి వెళ్లారు, ఇదేమిటి వరండాలోకి ఎందుకు? అతన్ని అక్కడ వొదిలి, "వెళ్ళండి" అని లోపలికి వెళ్ళి తలుపు వేసుకుంది. నుంచు న్నాడు ఏంతోచక. దొడ్డివేపు తలుపుకూడా గడియవేస్తున్న చప్పుడు.

* * *

బీచిదగ్గిరికి వొచ్చేటప్పటికి చీకటిపడ్డది. ఏం మరచి పోయిందో, సూర్యుడినించి కాంతి వెనక్కి తిరిగివొచ్చి భూమిని వెలిగించింది ఓ వుత్తరపు మబ్బుమీదినించి, బీచి మీద వాళ్ళ వీపులన్నీ ఎర్రబడ్డాయి. ఆలోచించుకుంటో దేశికాచారి చేర్చిన గుంపుదగ్గిరికి వెళ్లాడు లక్ష్మణసింగ్. సముద్రం, తీరం, ఎప్పుడూ సముద్రం, తీరంగానే వుంటాయి. మానవులే ఎందుకు అట్లా మారుతో వుండడం? లాలసకీ, తనకీ, ఎన్ని రకాలైన సంబంధాలు. ఆశలు, కోర్కెలు, ద్వేషాలు, అన్వేషణలు. చాలా సహజంగా "నేను ఇది"

అని చెప్పగలిగిన, చెప్పుకోగలిగిన మానవుడు ధన్యుడు. గాంధిగారికైనా చేతకాదు అది. ఆ కొండపక్కన ఆశ్రమం నిర్మించుకున్న యోగికి చాతనౌనా? అతని మనసులో ఆ నిమిషాన, లాలస తనకెంత కావాలో, తనకి ఎట్లాకావాలో స్పష్టం అయింది.

సింగుకు దేశికాచారిమీద కోపంగా వుంది. తన పెళ్లాన్ని దాచుకున్నాడని, తనతో మాట్లాడకండా చేస్తున్నాడని, కాని ఆమె లాలస ఔనా కాదా? ఐతే అంత నటించగలదా తనని ఎరగనట్టే. ఆమె చెపుతుందా దేశికాచారితో తను వొచ్చినట్టు? ఆమె లాలస కాకపోతే చాలా చిక్కు. దేశికాచారి అడిగితే, తనేం చెపుతాడు? ఎందుకు వెళ్ళానంటాడు అతని భార్యదగ్గిరికి? ఆ గుంపులో మెల్లిగా వెనకాలగా కూచున్నాడు. నరసింహారావు చెపుతున్నాడు క్లబ్బులో తాము అమెరికా పత్రికలో బీచి బొమ్మని చూపి, భీమ్లీకి ఎట్లా బైలుదేరారో.

"ఏం అలా వుందా భీమ్లీ?" అన్నాడు డి. ఇ. ఓ. సత్యనారాయణ.

'కాని అలాంటి ఆడవాళ్ళే."

"ఇది ఇండియా" అన్నాడు గర్వంగా సత్యనారాయణ.

"ఏం బీచి. అందమూ అన్నీ మొగవాళ్ళకేనా ఇండియాలో?"

"ఇంతకీ బీచి అందం ఆడవాళ్ళకి కావాలనా, ఆడ

వాళ్ళ అందం బీచిలోని మొగవాళ్ళకి కావాలనా? ఏమిటి మాట్లాడుతున్నారు?" అన్నాడు దేశికాచారి

"అట్లాంటి అందమైన వాళ్ళున్న ఆడవాళ్ళేరీ ఈ దేశంలో?"

"లేకేం? పోషణలో, అందం కావాలనే పట్టుతో జీవించడంలో వుంటుంది;"

"ఏమో! అందం చాలా గొప్పసంగతేగాని, అందం కోసమే బతకడం అందాన్ని బతుకుతెరువు చేసుకోవడం. అందం ఆకర్షణకి ఉపయోగించడం నీచం" అన్నాడు దేశికాచారి.

"కాని అసలు ఏ సంగతికి ఒక ఛాన్సునీ, స్వాతంత్రాన్నీ, వ్యవధినీ ఇస్తేగా స్త్రీకి! ఈ మొగాళ్ళు వొంటరిగా వొచ్చి బడాయిలు కొయ్యకపోతే, పోనీ భార్యల్ని వెంటపెట్టుకుని రాకూడదూ? తాము తిరిగి ఇంటికి వెళ్ళేటప్పటికి వంటచేసి వేడిగా, సిద్ధంగా వుండాలి" అని చాలా కోపంగా ఎటాక్ చేశాడు చప్పున చీకట్లో కూచున్న సింగ్.

"కాని ఆ భార్యల్ని అడిగారా వాళ్ళకి యేమి యిష్టమో ?"

"పతిసేవా, వంటా, ఇంట్లో కూచోడం, స్త్రీ ధర్మమని యుగాల్నించి వాళ్ళకి బోధించి, ఇప్పుడు దొంగ ప్రశ్నలువేసి ఏం లాభం ?"

"పోనీ ఇంట్లో హాయిగా వున్నవాళ్ళని బీచికి, వీధికీ లాక్కురావడ మెందుకు ? స్త్రీపైని గౌరవమున్న ఏ పురుషుడూ ఆమెని వీధులవెంట, బీచివెంటా ఎన్నడూ తిప్పడు.

స్త్రీ అమూల్యమైన వరం. ఆమె సౌందర్యం అపురూపంగా తాను భక్తితో అనుభవించాలి. ప్రతిచోటా తనతో తిప్పు కుని, అందరికి చూపుకుంటే ఎంతమామూలూ, చౌకా ఐపోతుందో గమనించారా ? ప్రేమాస్పదులైన తన ఆప్తులతో తప్ప స్త్రీ సహజంగా మధురంగా మాట్లాడలేదు. ఆమె స్వభావం ఎమోషనల్, సెంటిమెంటల్, ఆమెచేత తెలివిగా సమస్యలూ, రాజకీయాలూ. మాటాడించాలని చూస్తే, పురుషుడు చెప్పిన మాటల్నే చిలకపలుకులు పలుకుతుంది రోతగా అన్నాడు దేశికాచారి.

"అయితే స్త్రీలకి మెదడు లేదంటారా ?" అన్నాడు సింగ్.

"లేదంటే మాత్రం అవమానమేముంది. అంతకన్న గొప్ప ఏం కావాలి ?" అన్నాడు దేశికాచారి.

"కాని పురుషుడు తన స్వంత ఉపయోగాలకోసం స్త్రీని దాచుకుని ఈ దొంగ కబుర్లు చెపుతున్నాడు. కావలిస్తే 'చలం స్త్రీ' చదవండి."

"చలం వుత్త గుడ్ ఇన్‌టెంషన్డ్ ఫూల్. టాగూరు స్త్రీమీద రాసిన వ్యాసం చదవండి" అన్నాడు దేశికాచారి.

"కాని ఇట్లాంటి థియరీలు మాటాడి పురుషుడు తన స్వార్థమైన సౌభాగ్యాలకి స్త్రీని నిరంతరం బలి తీసుకుంటున్నాడా లేదా ?" అన్నాడు సింగ్.

"ఎప్పుడూ ఏదో ఓ థియరీని ఉపయోగించుకుంటాడు తెలివిగల స్వార్థపరుడు. గాంధీగారి సింపిల్ లైఫ్‌థియరీని బోధించి డబ్బుకూడ పెట్టుకునే అనుచరులవంక చూడండి."

"చివరికి గాంధీగారు కూడా స్త్రీకి స్వాతంత్ర్యంకావా లన్నారు."

"ఆయన భార్యకిఏమాత్రం స్వతంత్రం ఇచ్చారేమిటి" అన్నాడు రావు.

"స్వతంత్రం ఎవరు వొద్దంటారు? కాని జీవితంలోని సౌఖ్యాన్ని ధ్వంసంచేసే స్వతంత్రంవల్ల ఏం వొరుగుతుంది? అదీ ప్రశ్న" అంటో లేచాడు దేశికాచారి. అందరూ చెల్లా చెదరైనారు. దేశికాచారి లక్ష్మణ సింగ్ భుజంమీద చెయ్యేసుకుని నడుస్తున్నాడు.

"ఇప్పుడు ఇంత చప్పున ఎందుకు లేచాను? నా భార్య నాకోసం ఎదురుచూస్తో వుంటుంది. ఇంటికి వేళకి వెళ్ళకండా భూకంపమైనా ఆపలేదు నన్ను."

"మీ భార్య యే దేశస్తురాలు ?"

"ఈ దేశస్తురాలే."

"అంటే, వాళ్ళది ఏ వూరు ?

"ఈ వూరే."

"పుట్టిల్లు ?"

"ఆమెకి పుట్టిల్లు లేనట్టుంది !"

"అంటే మరి ఆమెవాళ్ళు—"

"ఎవరూ లేరేమో !"

"మీకు తెలీదా ?"

"తెలీదు."

"ఆమె పేరు ?"

"తెలీదని ఇదివరకు చెప్పినట్టున్నాను."

నిశ్శబ్దం. మళ్ళీ అన్నాడు దేశికాచారి—"నే నిట్లా 'తెలీదు' అంటోవుంటే, మీరు నమ్మటంలేదు మే మిద్దర మూనూ, నే నొక్కణ్ణేనో, చాలా మోసగాళ్ళమనో, నిజం చెప్పడం ఇష్టంలేదనో అనుకుంటారు. చాలా ముఖ్యంగా అవసరమైన సంగతులు తప్ప తక్కినవి తెలుసుకోలేకపోవడం జీవితంలో సుఖానికి చాలా ముఖ్యమైన విషయం. ఆమె సంగతి మీకా ఆరాటం ఎందుకు చెప్పండి ?"

"అలాంటి ఆమెని యెరుగుదును"

"యెరిగి వుంటేనేం? ఆమెనో, అలాంటి ఆమెనో యెరుగుదురు. సరే, యెందుకా సంగతి? వొదిలెయ్యండి. ఏం లాభం తప్పేకుని తెలుసుకుని? ఎవరైతే ఏమొచ్చింది"

"చాలా ముఖ్యం నాకు. నేనే అడుగుతాను ఆమెని"

"యెందుకు అడగడం? వృత్తగొడవ. నేనే అడగలేదు కదా, మీరెందుకు అడగడం ?"

"ఆమె మీ భార్య కాదా?"

"భార్య అయితే అడిగి అంతుబొంతులు, ఆసరాలు తియ్యాలా పాపం ! అదే అంటున్నాను స్త్రీమీద గౌరవం నేర్చుకోమని. గొప్ప వైన్ తాగుతో, ఇది దేంతో చేశారు. ఏ దేశంది? యెంత ఖరీదు... ఈ ప్రశ్నలెందుకు? నా మాట విని ఆమెని ఆమె దోవన బతకనీండి" అన్నాడు విచారంగా.

"ఈ సాయంత్రం అడిగాను."

"ఎక్కడ ?"

"మీ ఇంట్లోకి వెళ్ళి."

చప్పున పెద్ద నిశ్శబ్దం. హోరున వీచే సముద్రంమీద గాలిలో నిశ్శబ్దం. నల్లగా ముంచుకున్న కొండ నీడలాంటి నిశ్శబ్దం.

"ఐతే, మామూలు మర్యాదల్ని మీరితే చాలా జాగ్రత్తగా వుండాలి మీనించి. గుడ్ యీవినింగ్" కఠినంగా అని వెళ్ళిపోయినాడు దేశికాచారి.

* * *

పాపం ఆ రాత్రి మిత్రు లిద్దరి మనసులూ ఏం బాగా లేవు. దేశికాచారికి కోపం తెప్పించారు. లక్ష్మణసింగ్ అట్లా ఇంట్లో జొరబడడం నరసింహారావు యేమాత్రం వొప్పుకోలేదు. కాని మొదటిసారి లక్ష్మణసింగ్ తన హృదయంలోని బాధ చెప్పుకున్నాడు నరసింహారావుతో. భోజనం చేసి బీచికి వెళ్ళి ఎత్తయిన ఇసిక దిబ్బమీద కూచున్నారు; ఆలస్యముగా యెదురుగా సముద్రంలోని కాంతి పేరుకుని పైకి వస్తున్నట్టు కనపడే చంద్రబింబం కేసి చూస్తూ. మిత్రుడితో తన చరిత్రనంతా చెప్పి, "ఆమె లాలస కాదంటే, నా మనసు వొప్పుకోదు" అన్నాడు లక్ష్మణసింగ్.

"జొనన్కో పోనీ, ఆమె నిన్ను మరిచిపోయింది. నువ్వు వొద్దనుకుంది; ఇంక ఆమెజోలి నీకెందుకు ?"

"అనుకోదు. అనుకోడానికి వీల్లేదు. నే నామెని వొదలలేను."

"కాని నువ్వు ఈ సాయంత్రం చేసినపని ఏమీ బాగాలేదు,"

"కానినా స్థితి,నిస్సహాయమైన నా స్థితినీకర్థంగాదా?"

"ఇదంతా ఏం లాభం? మనవూరు పోదాం రా."

"లాభం అని యోచిస్తామా? [ఆమె] లాలసే ఐతే ఆమెని నేను మళ్ళీ తెచ్చుకుంటాను."

"తెచ్చుకుని? ఎక్కడికి? అతనితో అన్నాళ్ళు వున్న తరవాత నీకేం సుఖం? మూడు జీవితాల్ని భగ్నం చేస్తావు."

"నా భార్య, నా లాలస, దేశికాచారికి నిజంగా ఆమె ఎవరో తెలీదంటావా? పేరుకూడా తెలీదట. నమ్ముతావా? వుత్తదొంగ వాడు. ఏదో [భ]భయపెట్టాడు ఆమెని. వాడి పొట్టా, మీసాలూ, వాడి వయసూ! వాడెక్కడ? లాలస ఎక్కడ? ఈ మిస్టరీకి అంతం కనుక్కోవాలి."

"ఏంలేదేమో కనుక్కోడానికి."

"అదే కనుక్కోవాలి."

"కాని ఇంక లాలస నీకు కనపడితేగా? దేశికాచారి ఎంత కఠినంగా మాటాడాడో చూశావా? ఎంత మంచివాడో అంత అపాయమైనవాడు. బ్యాంకుల్నే కొల్లగొట్టాడు. జాగ్రత్త" అన్నాడు నరసింహారావు.

మిత్రులతో చెప్పుకోడమే, సలహా లడగడమే కాని మిత్రుల సలహా ప్రకారం నడుచుకునే వాడెవడు? అసలు తన నిజమైన ఉద్దేశ్యం, మనసు, బాధ తెలుసుకుని చెప్పుకోగలవా రెవరు?

"లాలసని నీకు ఎట్లానూ చూపడు. ఇంతకీ లాలస జానకో కాదో!" అన్నాడు నరసింహారావు.

మర్నాడు మధ్యాన్నం మూడింటికి లక్ష్మణసింగ్,

"పుగుద జవరాలి పచ్చని మోముపైన, గాటుక నలంకరించిన కన్నులట్లు."

అని బిగ్గరగా పాడుతున్నాడు.

"అవును, కొత్తగా వొచ్చిన 'రుతుగానం' లోంచి కదూ! ద్రాక్షపళ్ళకి పోల్చాడు బుద్ధిలేనివాడు" అంటో ప్రవేశించాడు దేశికాచారి.

"ఆ పై రెండుపాదాల అందంచూసి, ఎంత గొప్ప ఉపమేయమో అనుకున్నాను" అన్నాడువాళ్ళనిచూసిమళ్ళీ. అప్పటికి వాళ్ళు ఆమెని చూడనేలేదు, వెడల్పయిన అతని వీపువెనక.

"ఇంకా యువకుడు" అంది ఆమె.

ఆ కంఠంవిని అదిరిపడి కూచున్నారు వాళ్ళిద్దరూ.

పరిచిన పక్కల్ని మలిచి కూచోమన్నారు. కాని వాళ్ళిద్దరినోట మాటరాలేదు కొన్నినిమిషాలు. ముందు నరసింహారావు, టీ తెప్పిసానని గొనుగుతో బైటికి తప్పించుకున్నాడు.

"ఎన్నాళ్ళను [redacted] లాల్ ని ఒకసారి నాతో మీ దగ్గిరికి రమ్మని అడుగుతున్నాను. ఇవాళకి బైలుదేరింది" అన్నాడు దేశికాచారి.

ఇద్దరూ చేరి తనను ఎక్కిరించడానికో, ఏడిపించటానికో వొచ్చారని నిశ్చయమయింది లక్ష్మణసింగ్ కి తను

గార్డుమీద వుండాలి. ఆమె ముఖం వైఖరి కొత్తగా వుంది. దూరంగా, కలలో బతుకుతున్నట్టుగాక, మామూలు మనుషుల్లోకి వొచ్చింది. ఆమెలేచి పుస్తకాల మూలకి వెళ్ళి అన్నీ తీసి చూస్తోంది చనువుగా. సందేహంలేదు, ఆమెలాలసే. ఇవాళ స్పష్టంగా తెలుస్తోంది.

"ఈ పుస్తకం మీకు చాలా ఇష్టంలాగుందే." అంది గార్డెన్ ఆఫ్ కామా తీసి చూస్తో.

"అవును. గొప్ప కవిత్వం. అంత చక్కని శృంగారం మోహంలో అంత అగ్ని" అన్నాడు సింగ్.

"కాని చాలా దొంగపుస్తకం. ఇదంతా నిజంగా పరిషియన్ పటాన్ కవిత్వం గావును అనిపించేట్టు చేస్తుంది. ఇలాంటి కవిత్వం ఆ భాషల్లో లేనేలేదు" అంది ఆమె.

"అసలు కవిత్వమంతా అబద్ధమేగా?" అన్నాడు సింగ్.

"కాదు అబద్ధంకాదు. వూహా. వూహాకి ఒక అర్హత రావాలంటే సత్యంమీద-అంటే-మానవ హృదయంలోని సత్యంమీద ఆధార పడాలి కథలూ అంతే. ఏవిషయమన్నా ఎట్లానన్నా రాయవొచ్చు. కాని కళ సత్యానికి విరుద్ధంకాని దూరంగాని కాకూడదు. ఫేరీటేల్ అంత అబద్ధం ఎదీగాదు. కాని మానవుడి కల్పనా సత్యంమీద గట్టిగా అల్లడంవల్లనే ఎన్ని యుగాలకీ అట్లా ఆకర్షిస్తోవుంటాయి కథలు"

"టీ" వొచ్చింది వేడి బజ్జీలూ, ఆవడలూ టీ కాగానే బీచికి పోదామన్నాడు నరసింహారావు.

"ఇవాళ మిసెస్ దేశికాచారికూడా వస్తారు. అవునా?"

"కాదు. ఇంటికి వెళ్ళాలి ఆమె... కవిత్వంవుత్త కల్పన. అబద్ధం. కాని ఏవిషయమైనా గొప్ప సత్యం తెలుసుకోవాలంటే కవిత్వాన్ని ఆశ్రయించ వలసిందే. వయస్సు వృత్త గుడ్డిది. భూమినిమించి ఎత్తుకి చూడడానికి కళ్ళులేవు వయస్సుకి. భూమితప్ప ఇంకోటి కనబడని మనిషి చూపు చాలా సంకుచితం. నిజమైన కవిత్వానికి మూడోకన్ను తెరుచుకుని వుంటుంది."

'దివ్యదృష్టా?' అన్నాడు నరసింహారావు.

'తప్పకండా, రండి పోదాం. లాల్, నువ్వు ఇంటికి వెడతావా?'

"ఆమెని కూడా తీసుకురండి."

'ఆమెకి ఇష్టంలేదు నాతో కలిసి తిరగడం. ఇంక ఎందుకు వచ్చిందంటే, సింగు ఆమెని ఇదివరకు ఎరుగుదునని భ్రమపడుతున్నాడుట. అదేదో స్పష్టం చేద్దామని.'

లక్ష్మణసింగ్ కి చాలా వొళ్ళుమండుతోంది. ఇదంతా వృత్తకుట్ర. తనని వేళాకోళం పట్టిద్దామనుకుంటున్నాడు.

'అయిదు నిమిషాలు కూచోండి. నా భార్యపేరు లాలస. కాలేజీ రోజుల్నుంచి ఆమెని ప్రేమించి, తపించి ఆమెని పెళ్ళి చేసుకున్నాను. నాకు ఆమెమీద ఆనాటికీ ఈనాటికీ గొప్ప ప్రేమ. ఆమె మాల్వంకర్ అనే సంగీత పాటకుడితో వెళ్ళిపోయి నాలుగేళ్ళయింది. ఈమె సరిగా లాలసే. లాలసేనని నాకు నిశ్చయం. ప్రపంచంలో రెండో

లాలస వుండడం అసంభవం. ఈమె ఆమే. ఎందుకు తాను లాలసని కానంటోందో నా వూహకి అందటంలేదు.'

'ఒకవేళ ఐతే ఇప్పుడేమంటారు?' అన్నాడు దేశికాచారి.

అదే లక్ష్మణసింగుకి స్పష్టంగా తెగని సమస్య.

"ఐతే తరవాత యోచించవచ్చు" అన్నాడు.

'ఆమె అభిప్రాయాన్ని పట్టికూడా వుంటుందిగా, ఈయన ఏం చేసేదీ?' అన్నాడు నరసింహారావు.

'నా కామెమీద గొప్ప ప్రేమ. ఎన్నటికీ నశించని ప్రేమ' అన్నాడు సింగు.

'ఎందుకు వెళ్ళిపోనిచ్చారు? అన్నాడు దేశికాచారి.

'ఆమె స్వతంత్రంకోసం, ఆమెమీద గౌరవంవల్ల.'

'ఇప్పుడూ అక్కడే ఆగకూడదూ' అని మళ్ళీ.

'చాలా పొరబాటు చేశారు. స్త్రీ మీద గౌరవం వుండాలి. కాని ఆ గౌరవం గౌరవంగా హృదయంలో వుండి పోవాలిగాని ఎప్పుడూ కార్యరూపంలో కనపడకూడదు. ఆమె క్షేమంకోసమే, మోహం కనబరచాలిగాని, ప్రేమ హృదయంలోనే వుండిపోవాలి.'

'అదేమిటి? ఆమె స్వతంత్రానికి అడ్డుపడనా?'

'తప్పకుండా. ఆమె స్వతంత్రానికి అడ్డుపడకూడదనే మీ ఆత్మ గౌరవాన్ని తొలగించుకోలేని మీ ప్రేమ ఏం గొప్పది? అతనితో సుఖపడుతుందని మీకు నమ్మకమా? లేదు. అంటే ఆమెమీదకన్న మీమీద, మీ ప్రిన్సిపిల్సు

మీద మీ కెక్కువ ప్రేమ. ఇంకో మనిషితో తన స్త్రీ సుఖపడుతుందని ఎప్పుడూ వుండదు ప్రేమించే మనిషికి. అట్లా అనుకుంటూ నమ్మేడం ఆత్మవంచన అట్లాంటప్పుడు ఆమెని క్రూరంగా ఆమె గతికి వొదిలి మీ బాధ్యతని వొదులుకున్నారా? స్త్రీ మీద గౌరవమే మొదటి తప్పు. గౌరవం బలహీనం. ఎందుకా గౌరవం? గౌరవంతో, కవిత్వంతో ప్రేమతో కట్టుకోవాలని చూస్తారు స్త్రీని, నవీన యువకులు అంతకంటె చాతగాక.

"మరి ఇంకెట్లా కట్టుకోవాలి ?"

"అదే. కట్టుకోనే కూడదు. నానించి ఎందుకుపోతుంది అనే ఆత్మ విశ్వాసం గలవాడు ఎన్నడూ యీ దేవీస్తుతుల జోలికి పోడు. తనలో విశ్వాసం లేకనే, స్త్రీని యీ సింహాసనాలమీద కూచోపెట్టడాలు. అంత ఎత్తున కూచోపెడితే ఆమె దిగలేదని వీరి వెర్రిఆశ. వెళ్ళేరోజున ఎలానూ వెడుతుంది. పైగా యీ పూజలవల్ల నిన్ను వృత్తిలోకువజేసి మరీ పోతుంది.

"తరవాత ఆమె సంగతి మీకేం తెలీలేదా ?" అంది ఆమె.

"అతను వొదిలేశాడు ఆమెని తనని తిరిగి తీసుకోమని రాసింది, చాలా అవస్థలో వుండి ?"

"మీరు ?"

"జవాబు రాయలేదు."

"ప్రేమవల్ల నేనా ?" అంది ఆమె, వెక్కిరింపుగా.

ఇంక ఆమె లాలసే అనటానికి సందేహ మేముంది ?

"మరి నా పేరు ? అదిగాక ఆమె నాతో వుంటుందని నిశ్చయం ఏముంది ?"

"ఇప్పుడు మాత్రం ఏం నిశ్చయం ?"

"లేదు. కాని..." ఆగాడు.

"లాభంలేదు. మీ భార్య, ఎవరో లాలస అంటు న్నారే అట్లాంటి స్త్రీని నిలుపుకునే యోగ్యత మీలో లేదు. అందుకనే వెళ్ళిపోయింది" అంది ఆమె.

"మరి ఏం చెయ్యాలి ? తాళాలు వెయ్యనా ? కాళ్లు విరవనా ?" అన్నాడు కోపంగా సింగు.

"చెయ్యవలసిన పనులు మీకు తెలుసునన్నమాటే, ఆచరణలో పెట్టె శక్తి లేకపోయిందిగాని" అన్నాడు దేశికాచారి.

"శక్తిలేక కాదు."

"అదే ఒద్దనుకుని, అన్నీ వొకటే."

"ఈమె మీనించి వెళ్ళిపోతానంటే, మీరాపనులు చేస్తారా ?" అని ధిక్కరించాడు సింగ్.

"ఊనూ ! ఈమె వెళ్ళిపోతాననదు."

"ఏం ?"

"ఆ అవసరంరాదు."

"ఎందుకు రాదు ?"

"వొస్తుందనే భయం నాకు లేదు గనక. అదీగాక ఆమె వెళ్ళిపోకుండా నాతో వుండాలన్నంత మొండి గ్రుడ్డి ప్రేమ లేదునాకు. నా కేదో అమూల్యమైన దేవి నాభార్య అయింది. నాకింక ఇట్లాంటి స్త్రీ దొరుకుతుందా అనే అపు రూపమూ లేదు. వెళ్ళిపోతే నే నెట్లా బతకను – అనే భయమూ లేదు. అది ప్రేమ కాదంటారు కవులు. కాకపోతే పోయిందిగాని ఆమెకీ నాకూ కూడా చాలా శాంతి. అందు కనే ఆమె వెళ్ళదు" అని లేచాడు దేశికాచారి.

"ప్రేమేవుంటే, స్వార్థంలేని ప్రేమే వుంటే, అదే చెపుతుంది ఏ అపాయంలో ఏం చెయ్యాలో! ఇంత వాదన వ్యర్థం" అంది ఆమె.

నలుగురూ గంటస్తంభందాకా కలిసి వెళ్ళారు. అక్కడనించి ఆమె పక్క సందులోంచి వెళ్ళాలని బైలు దేరింది వాళ్ళని వొదిలి. వెళ్ళేప్పుడు ఎవరితోనూ ఏమీ అనలేదు. వెళ్ళిపోయింది లోన్లిగా. ఆమె వొంటరిగా వెళ్ళి పోతూవుంటే, పెళ్ళయినాక లాలసని తాను ఇంట్లోనేగాని దూరంగా నడుస్తోవుంటే ఆ అందాన్ని తాను చూడనేలేదే! ఆమె నడకలో యెంత వొయ్యారం వుంది అనుకున్నాడు సింగ్. కొంత శక్తిని ప్రేరేపించుకుని ఆవేగంతో కొంత దూరం వెళ్ళి మళ్ళీ కొత్త ప్రేరేపణతో కదులుతున్నట్టుంది ఆమె నడక. అది ఈ దేశపు నడక కాదనిపించింది అతనికి. లాలస కాదేమో!

తొరలోనే సముద్రం వొడ్డున వాళ్ళని వొదిలి వెళ్ళి పోయినాడు దేశికాచారి.

తాము వొచ్చిన కొత్తలో ఆ నాటి రాత్రి ఆమె వొంటరిగా ఓసారి సముద్రం రాళ్ళమీదే కనపడ్డది. ఏం చేస్తోంది అక్కడ భయం లేకండా! యెన్నడూ ఇల్లు విడవని స్త్రీ! తరచూ అట్లా చీకట్లో వొస్తూనే వుంటుందేమో! సముద్రం దగ్గిర ఆమెని కలుసుకుంటే! ఈ యోచన నరసింహారావుది. ఆమె కనపడితే తాను సింగును విడిచి దూరంగా పోతానన్నాడు. వాళ్ళిద్దరూ ఎంతసేపు మాటాడుకున్నా వాళ్ళకి దేశికాచారి ప్రవర్తన ఏమీ అర్థంకాలేదు. రహస్యంగా వున్నవాళ్ళు అర్థమవుతారు, కాని దాచటానికి ఏమీ లేనట్టు మాటాడుతో, ఆమాటల్లోంచి ఏమీ చెప్పని వాళ్ళు చాలా ఘాతకమైన దొంగలు అనిపించింది.

మర్నాడుపొద్దున్నే దేశికాచారినించి చీటీవొచ్చింది, వాళ్ళిద్దర్నీ మధ్యాన్నం భోజనానికి రమ్మని. భోజనానికి ముందు ద్రాక్షరసం తాగుతో సముద్రం వంక చూస్తో కూచున్నారు. ఆవాళ ఆమెకూడా వొచ్చి కూచుంది కుర్చీలో. సింగ్‌కి చాలా బాధగా వుంది. తనభార్య, తన భార్య కానట్టే యెవరిభార్యో ఐనట్టు, తనముందు కూచుని తనతో సంబంధం లేనట్టే మాట్లాడడం. యెంత నేర్పరి ఐవుండాలి ఆ స్త్రీ. తనకి విరక్తి యెన్నడూ కలగలేదు ఆమెమీద. ఆ కసిలో మరిచిపోవాలని చూశాడు. కాని మళ్ళీ కనిపించింది. తనని యెరగనట్టు చూస్తుంది పైగా. మానవుడు భరించగలిగిన బాధని మించిపోయింది. ఎందుకు తాను ఆ వూళ్ళో ఇట్లా వేళ్ళాడ్డం?

సముద్రం మీాదనించి చల్లనిగాలిలో ఆమెకుచ్చెళ్లూ, ముంగురులూ యెగురుతున్నాయి.

ఆ రాత్రి దృశ్యం జ్ఞాపకం వొచ్చింది నరసింహారావుకి. ఆ పొద్దున్నే అన్నాడు సింగుతో "ఆరాత్రి నువ్వు వాళ్ళిద్దర్నీ చూసి వుంటే ఆమె నీ భార్యఐనా సరే, ఆమెని డిస్టర్బు చెయ్యడానికి నీ మనసు వొప్పుకుని వుండదు" అని.

"ఆ మధ్యాన్నం, గొప్ప వృక్షాల నీడలలో వూగే ఆ బంగళాని చూస్తే, ఈ బంగళాని వొదిలి ఏ స్త్రీ కూడా కదలదనిపించింది. ఆ స్థలం శాంతేకాదు, దాన్ని మించిన ఓ స్నిమితం వాళ్ళిద్దరూ వాళ్ళచుట్టూ కల్పించుకున్నా రనిపించింది. అందుకనే అన్నాడేమో లక్ష్మణసింగ్, "ఇది చివరి భోజనం. మేము రేపు వెళ్ళి పోతున్నాము" అని, ఆలోచన లేకుండానే.

ఆమాటకి నరసింహారావులో ఆశ్చర్యం చూసింది ఆమె.

"ఏమిటీ, అకస్మాత్తుగా ఈ డెసిషన్!" అన్నాడు దేశికాచారి.

"వెళ్ళాలి యెట్లానూ, ముఖ్యమైన కేసువుంది. సరే రేప్పే వెడదా మనుకున్నాను."

"మిమ్మల్నిద్దర్నీ చాలా మిస్ అవుతాము చాలా కాలం. ఏదో మీారు వెడతారు అన్న సంగతే మరిచిపోయినాము" అన్నది ఆమె.

భోజనాల దగ్గరకూడా ఆమె వాళ్ళతోనే కూచుం:,

"మీభార్య వెళ్ళిపోయిందన్నమాట" అంది ఆమె.

"చాలా మూర్ఖురాలై వుండాలి" అన్నాడు దేశికాచారి.

"కాదు, అంతకన్న తెలివి, విశాలదృష్టి, సూనృతం గల స్త్రీని కలుసుకోడం కష్టం" అన్నాడు లక్ష్మణసింగు.

"నేనే తగను ఆమెకి" అన్నాడు మళ్ళీ.

"ఓ విధంగా మన మెవరమూ తగము మన భార్యలకి. మీకన్న ఉత్తముడికోసం కాదుగా అట్లా మిమ్మల్ని వొదిలింది?" అన్నాడు దేశికాచారి.

"ఏమో ఆమె కళ్లతో చూడాలి."

"కాని ఉత్తమ స్వభావాన్ని గుర్తించడానికి వేరే కళ్ళు అనవసరం. ఆమె కేదో కనపడి వుంటుంది. అది నిజం. కాని యెవరికీ కనపడనిది ఒకరికి కనపడ్డదని దానికి వాస్తవం ఆపాదించము. ఆ ఒకరికి దృష్టిదోషం అంటాము. అంతేగాని మబ్బుకళ్ళ దృష్టికి 'ఆకళ్ళతో చూడాలి' అనం" అన్నాడు దేశికాచారి.

"మరి కవులూ, జీనియస్‌లూ!" అని అడిగాడు నరసింహారావు.

"అది మనకళ్ళని మించిన దృష్టి. అది యింపర్సనల్. కాని వ్యామోహమనే జబ్బు కనబడుతో వుండగా, దాంటో సందేహమేముంది? అట్లా ఐతే సంధి పేలాపనలకి కూడా ఓ వాస్తవాన్ని స్తామా?"

"మీరు మళ్ళీ పెళ్లి చేసుకోరాదా?" అంది ఆమె.

"లాలస తరవాత, ఇంకో స్త్రీకి సుఖమివ్వలేను. అదిగాక ఆమె తిరిగి వొస్తుందనే ఆశకూడా వుంది."

"తిరిగివొస్తే తీసుకుంటారాం ?"

"ఆ."

ఆ "ఆ"లో హెసిటేషన్ ఆమె గమనించకపోలేదు.

వాళ్ళు వెళ్ళేప్పుడు దంపతులిద్దరూ వాళ్ళని తోట చివరిదాకా సాగనంపారు. ఇంటికి వెళ్ళి సామానులు సర్దుకుంటో వుంటే, చాలా దిగులుగా వుంది వాళ్ళిద్దరికీ. ఎందుకని ఆలోచించుకుంటే ముఖ్యం దేశికాచారిని విడిచి వెళ్ళడానికి. వుండిపోతానంటాడు, లక్ష్మణసింగ్. కాని నరసింహారావు అతన్ని యీ గోలల్లోంచి తీసుకు పోదలచుకున్నాడు.

"సరే వెడుతున్నాముగా, ఓసారి సముద్రం దగ్గిర వెతుకుతాను"

"ఏం లాభం ?"

"నా మనసులోవున్న నాలుగు మాటలూ ఆమెతో అనేస్తాను" అన్నాడు లక్ష్మణసింగ్.

"వాళ్ళిద్దరూ ఏదో ఒక గొప్ప శాంతిని నిర్మించున్నారు సింగ్. ఆశాంతిమూలాన ఆమె అతనిదీ. మామూలు కుటుంబాలలో శాంతిగానే వుంటారు. అంటే తగాదాలకి కావలసిన తెలివీ, శక్తీ లేక అలిసి పడివుంటారు. అంతకన్న తన్నుకోడాలేనయం. కాని వాళ్ళిద్దరి మధ్యా సంపూర్ణమైన ఏకీభావం, ఐక్యం. విడబడరు" అన్నాడు నరసింహారావు తన వయసుకి మించిన వివేకంతో.

చివరిసారి సాయంత్రం బీచికి వెళ్ళారు, దేశికాచారిని తప్పించుకోడానికి పూరువాదిలి దూరంగా దక్షిణవేపుగా నడిచి. నరసింహారావు కొబ్బరి తోటముందు అప్పుడే వొచ్చిన చాపల వల గుంపులో చేరి నిలిచిపోయినాడు. లక్ష్మణసింగ్ నడిచిపోయిచాడు సముద్రం వొడ్డునే. ఇంకా వెలుగువుంది. ఆ నాటి మొగలి పొదను దాటి, సముద్రం మలుపు తిరిగేచోట ఇసిక దిబ్బమీదికి ఎక్కి చూస్తూన్నాడు ఆమె వొస్తుందని. గాలికి ముళ్ళబంతులు దొల్లుకుంటూ పోతున్నాయి. చాపలు అతన్ని తొంగిచూసి నీళ్ళవేపు పరిగెత్తాయి. కడపటి కాంతి అలల తలలమీద తెల్లని నురుగుని వొదలలేక ముక్కలై కరిగిపోతోంది. దూరంగా అంతులేని అగాధంవంక చూస్తోవుంటే, పెద్ద దిగులు వచ్చింది అతని మనసులోకి. ఇన్ని తంటాలుపడి, స్త్రీకోసం తపించి, తగూలాడి, మనిషి వుత్త బూడిదై నీళ్ళలో కరిగి, నేలలోకి ఇంకిపోతాడు. ఎందుకీ ఆరాటం అనిపించింది. ఈ ఆలోచనలో వుండగానే చీకటి పడుతోంది. తను వచ్చిన పనిని తలుచుకుని పక్కకు తిరిగి చూసేప్పటికి ఆమె ఓ నీలం చీరెనో, కోటునో యెత్తయిన రాయిమీద వదిలి సముద్రంలోకి దూకుతోంది. ఆ చీకట్లో కొండరాతిమీదనించి ఒక్క దూకు దూకింది అలలలోకి. యెంత ఈత వచ్చినా, ఆ అలలలో చీకట్లో... యెంత సాహసం! ఈమె వచ్చి తనతో కాపరం చేస్తుందా అనంతపురంలో! ఏమిటీ వెర్రి! లాలసకి ఇంత నిర్భయం... అంతేకాదు. ఈ సముద్రంలో అట్లా ఈదడం ఎంత ఆనందం, ఉల్లాసం అయి ఉండాలి!

ఈమె స్త్రీయేనా ? లేక లాలస చచ్చిపోయి దెయ్యమై ఈ దేశికాచారితో కాపరం చేస్తోందా? అనుకుంటూ లేచి, ఆమె వదిలిన కోటు దగ్గిరికి వచ్చి నుంచున్నాడు. ఆమెజాడ యెక్కడా లేదు చీకట్లో. ఏమీ కనపడటంలేదు. నురుగులు కక్కుకుంటూ కాళిమల్లే, మీదికి ఉరికే భయంకరమైన సముద్రం. అక్కడ కూచోడమే భయంవేసింది అతనికి. యెవరూ లేకపోతే, అతనికి భయంలేదు. కాని ఆమె ఆ నీళ్లల్లో యెక్కడో వుంది. యెప్పుడు వస్తుందో! కాని ఆ నీళ్ళల్లోకి దూకేముందు ఆమె యెత్తిన చేతుల అందం, ఆమె దేహం – చువ్వలమల్లే పైకి చాచుకున్న ఆమెనిడుపు, ఆ భుజాలవంపు. ఈ సౌందర్యరాశి ఒకప్పుడు తనది. కాని లాలసేనా ? ఒకవేళ తననిచూసి తప్పించుకోడానికి దూక లేదుకదా !

అనుకోకండానే "లాలసా, లాలసా !" అని కేకలు వేశాడు.

"యెవరు ?" అని సముద్రంలోంచి గొంతు. చాలా దూరంనించి.

"నేను, సింగుని. నువ్వు సురక్షితంగా వున్నావా ? రాగలవా ?"

నవ్వు. నిశ్శబ్దం.

"యెవర్ని లాలసా అని పిలుస్తున్నారు ?" అని కంఠం కొంత దగ్గిరిగా.

"నిన్నే."

"నేను లాలసని కాదు."

"కాకపోతే పోనీలే ఒడ్డుకి రా."

"యెందుకు ?"

"నిన్నాఁ నీళ్లల్లో నేను భరించలేను. భయమేస్తోంది."
నవ్వు.

"వస్తున్నాను" అని ఇంకా దగ్గరగా.

మెల్లిగా కొండపై రాతిని తెల్లని గుండ్రని చెయ్యితో పట్టుకుని ఒంటిని పైకి లాక్కుంటోంది. రాతిమీదనుంచి వంగి ఆమెని పైకి తీయాలని చేతులుజాచి చంకలదగ్గిర పట్టుకున్నాడు.

"వుండు, వుండు, జారుతావు. అవసరంలేదు" అంటోంది.

"అమ్మో, నువ్వెట్లా రాగలవు ?" అంటోనే సముద్రంలోకి పడ్డాడు. అతనికి ఈతరాదు.

"బ్లడీఫూల్" అనే ఛీత్కారాన్ని వింటో మునిగి పోయినాడు.

నీళ్ళ అడుగుకి పోతో "లాలసా ! నువ్వు లాలసే" అని అరవబోయి నీళ్ళు తాగాడు, ఉప్పటి సముద్రం నీళ్ళు.

లక్ష్మణసింగ్ మళ్ళీ కళ్ళు తెరిచేటప్పటికి, అతను స్వర్గంలో వున్నాడు, అంటే అతనితల లాలస వళ్ళోవుంది. రెండు క్షణాలు పట్టింది అతనికి అంతా జ్ఞాపకం తెచ్చుకోడానికి.

"యెట్లావుంది?"

ఆ ప్రశ్నలో ఆదుర్దా, దయా వినపడ్డాయి. ఇంక ఆ కల మారుతుందేమోనని కళ్ళు మూసుకుని నిశ్చలుడైనాడు. తన మెడ ఆమె తొడలకి, ఊపిరికూడా బిగబట్టాడు యెక్కడ మళ్ళీ బ్లడీఫూల్‌ని ఐపోతానేమోనని. తడిబట్టలవల్ల చలిపుడుతోంది. అయినా కదలతలుచుకోలేదు.

"పాపం చచ్చిపోయేవాడివే నాకోసం! యెట్లా భరించేదాన్ని! ఈపాటికి ఆ అలల్లో కొట్టుకుపోయేవాడివి!" అంటోంది నెమ్మదిగా.

ఆమె చంపలనించి జారి తన పెదిమలమీద వెచ్చగా కన్నీటిచుక్క పడ్డదనుకున్నాడు, దాన్ని చప్పరించాలనే కోర్కెనికూడా ఆపుకున్నాడు.

"యెవరో ఆ లాలస - నేను ఆమె ననుకుని..."

"కాదు. నువ్వే లాలసవి" అన్నాడు ఆగలేక.

"సరేలే, అవునులే, బావుందా? చాలా నీళ్ళు తాగావు."

చేతులు పైకిజాచి, ఆమె నడుముని కావిలించుకున్నాడు.

"నడవగలవా? వెళ్ళిపోదాం."

"నేను నడవలేను, లేవలేను. ఇంక యెన్నటికీ ఇక్కణ్ణించి లేవలేను" అని ఆమెని దగ్గరగా లాక్కున్నాడు. ఆమె పొట్టని తన నెత్తికి దగ్గరగా.

"లాలసా?

"నేను లాలసని కాదు."

"కాదా? ఐతే నీళ్ళలోంచి ఎందుకు తీసి బతికించి నట్లు?"

"లాలస కాకపోతేనేం? ఆ పేరులోనేగాని నీకు మనుషులమీద ఇష్టంగాదా?"

"పేరు పోనిలే. కాని నువ్వు నా లాలసవికాదా? యెందుకు ఇంత ఏడిపిస్తావు నన్ను! నేను నీకు చేసిన ద్రోహమేమిటి?"

"పోనీలే ఎవరో ఆమె ఆ లాలస. నేను లాలసే అనుకో."

"మరి లాలసా అని పిలుస్తాను"

"సరే."

"లాలస నా భార్య."

"సరేలే."

"సరేలే అని ఏం లాభం? నిన్ను వొదిలిపోలేను. నాకు తెలుసు నువ్వు పూర్తిగా నన్ను మరిచి పోలేదని. నువ్వింకా నన్నిట్లా కొత్త వాణ్ణిలాగా చూస్తోవుంటే, నేను మళ్ళ సముద్రంలో పడిపోతాను."

"అంత గోలచేసి లాలసవా, లాలసవా? అని తపన పడకపోతే, నే నెవర్ని అయితేనేం, నా స్నేహాన్ని సంపా దించుకునే ప్రయత్నం చెయ్యరాదూ!"

"నువ్వు కనపడితే కద!"

"కనపడలేను. నిన్ను చూస్తే చాలా దిగులేసింది.

ఆ లాలసమీద నీకు చాలా గొప్ప ప్రేమ ఐవుండాలి, నేను నీకు లాలసనౌతాను."

"నాతో వొస్తావా మావూరు ?"

"నువ్వే వుండు ఇక్కడ."

"నేనా ? నే నెట్లా వుండను ?"

"నేనా ? నే నెట్లా వస్తాను ?"

"యెందుకు రాకూడదూ ?"

* * * *

"ఏమిటిది ? తడిబట్టలు, నీళ్ళలో పడ్డారా ? నిమోనియా వొస్తుంది. లేచి రండి" అన్నాడు వాళ్ళ పక్కన దేశికాచారి.

చప్పున లేచారు వాళ్లు. కాని లక్ష్మణసింగు నడవలేక కూలబడాడు.

"లాలసా ? నువ్వు ఇంటికివెళ్లి ఈయనకి బట్టలు పంపించు" అన్నాడు.

లాలస వెళ్లిపోయింది.

దేశికాచారికి చత్వారమా అనుకున్నాడు సింగ్. లాస వెలళ్ళింతర్వాత, మెల్లిగా లక్ష్మణసింగ్ని నడిపిస్తో తీసికెళ్లాడు కొంతదూరం నౌకరు యెదురొచ్చిందాకా. ఇంటి దగ్గిర, సింగ్కి బ్రాందీ ఇచ్చి ఓ గదిలో పడుకోపెట్టాడు. ఆ రాత్రి గాఢంగా నిద్రపోయినాడు, అతకోసం కిటికీలోంచి అతనిమీద పడుతున్న తెల్లమబ్బుల వెనుకనించి వడభోసి

వొచ్చే వెన్నెలనైనా చూడకండా! తెల్లారకట్టగావును కల వొచ్చింది.

* * * *

తెల్లారకట్టకాదు. రాత్రంతాకూడా ఆ కల కరుగుతోనే వుందనుకున్నాడు. తాను చూడని వెన్నెలలోంచి, ఇనప కడ్డీలు అడ్డమున్న కిటికీలోంచి తన గదిలోకి వొచ్చింది లాలస. వొచ్చిందని తనకి తెలుసు. కాని మంచంమీద పడుకుని నిద్రపోతున్న తనని తను చూస్తున్నాడు. తనని లేపుతోంది ముద్దుగా తన చంపల్ని రెండు చేతులతో పట్టుకుని. మంచంమీద కూచున్న ఆమె తొడ తన రొమ్ముకి ఆనుతోంది. కాని తను లేవలేదు. "లేవడే? ఇంకాలేవడేం తను? అదేమిటి లాలసవొచ్చి పక్కన కూచున్నా, నిర్భాగ్యుడు ఇంకా నిద్రపోతాడేం?" అని చూస్తున్న తాను తపనపడుతున్నాడు. కాని ఆ మంచంమీంది మొద్దుశరీరం మేలుకోలేదు. తన ప్రయత్నం విఫలమై లాలస కిటికీ లోంచి సముద్రంవంక చూస్తోంది. ఏం తలుపుకి వచ్చిందో ఆమె పెదిమలమీద చిరునవ్వు. కాని కళ్ళలో దిగులు. కొంచెం కదిలి, అతనిబొదికి వొంగి మళ్ళీ బుజాలు పట్టి ఊగించింది. అతనుమూలిగి రెండో వేపుతిరిగి పడుకున్నాడు. ఆమె జాలిపడి అతనికి నిద్రాభంగం చెయ్యకూడదనుకుని అతని జుట్టుని ఇటూ అటూ సద్ది, చేతిని వేళ్లనీ ముద్దుగా తాకి, మెల్లిగా లేచింది.

"వెళ్ళిపోతోంది లే, లే" అని అరుస్తున్నాడు తను. కాని లాభం లేదు. నాలుగు శేర్ల ఉప్పునీళ్లని తాగి, కక్క

అలసిన ఆ శరీరానికి మెలుకువే రాలేదు. ఇంతలో ఆ కిటికీ లోంచి వొచ్చే నిర్మలమైన వెన్నెలకి అడ్డంగా, వెసల్పుగా దేశికాచారి నుంచున్నాడు. అతన్ని చూచి గదిలోని లాలస వొణికింది.

"లాలసా, రా. వెంటనే, రా." అన్నాడు దేశికా చారి. తప్పించుకోడానికి ఇటూ అటూ కొట్టుకుంది గదిలో లాలస. 'లాలసా' అని పిలిచాడు. ఓహో లాలసే అని సంతోషం, కల గనే సింగ్‌కి.

"ఏం భయంలేదు. ఏం చేస్తాడేమిట? నువ్వు నా భార్యవి" అంటున్నాడు తను. కాని యెవరికీ వినపడట్లు లేదు ఆ మాటలు.

"రా, వెంటనే రా."అని గర్జించాడు దేశికాచారి. లాలస ఆ కిటికీ కడ్డీలోంచి దూసుకుని బైటికి ఎగిరి పోయింది. దేశికాచారి బుజంమీదినించి. ఆమెని పట్టుకోవా లని అతను చేతులు జాచాడు. కాని ఆమె రాత్రి పిట్ట మల్లే "కీచు"మనిఅరిచి రెక్కలు కొట్టుకుంటున్నట్లు చప్పుడు చేస్తో గాలిలో వెళ్ళిపోయింది.

* * * *

ఈ కల కన్నాక అతనికి మెళుకువ రాలేదు. గదిలో కూచుని తెల్లారి ఆకలనంతా జ్ఞాపకం చేసుకుంటోవుండగా, బట్లరు టీ తీసుకొచ్చాడు. స్నానమైనాక, తను దేశికా చారి లుంగీ కట్టుకుని, షర్టు వేసుకుని వరండాలోకి వెళ్లాడు. సింగుకి ఆ రోజు ఆ వరండాలో ఏం ఘోరమైన నాటకం జరగబోతోందో, ఎవరెవరు కలిగిపోతారో, తన జీవితంలో

ముఖ్యమైన ఘట్టంమీద ఎట్లా తెర ఎత్తుతారో ననిపించింది. ఇంతలో నరసింహారావు వొచ్చాడు.

"ఏమైనాను అని ఆదుర్దా పడ్డావా రాత్రంతా?" అన్నాడు సింగ్.

"కొంత సేపే, ఇంతలో దేశికాచారి వొచ్చి చెప్పాడు."

"చాలా పెద్దమనిషి. వొచ్చాడా పాపం!"

"అందుకే కాదులే. నన్నూ, నిన్నూ మన వూరు వెంటనే వెళ్ళమని చెప్పడానికి" అన్నాడు నరసింహారావు.

నిన్న తనను ముంచడానికి చూసిన సముద్రం నురుగులు కక్కుకుంటో ముందుకు తోసుకు వొస్తోం దనిపించింది సింగ్‌కి.

"నరసింహారావ్, మనం చాలాసాహసమైన ప్రయత్నం చెయ్యాలి. లాలస అతని భయంవల్ల జంకుతోంది, నిజం బైట పెట్టడానికి.

అతని మాటల్లో రాత్రి కల పలుకుతోంది.

"రెండు చాకులూ అవీ కొనుక్కురానా?"

లాలస వొచ్చింది నిద్రకళ్ళతో, టీ కప్పు చేతిలో పట్టుకుని.

"దేశికాచారి పందిటికిగాని లేవరు. టీ తాగి మళ్ళ పడుకుంటారు" అంది.

నరసింహారావు లేచాడు.

"మళ్ళి ఇంకోసారి గుడ్‌బై, మేం వెళ్ళిపోతున్నాము" అన్నాడు.

"ఈయన...?" అంది ప్రశ్నగా లాలస.

"ఆయనకి ఇంక స్వతంత్రం లేదు. నేను లాక్కు వెళ్ళిపోతున్నాను."

అని వరండాదిగి, వెళ్ళి, వెనక్కి తిరిగి నవ్వుతో.

"వెళ్ళేలోపల నా మిత్రుడిమీద దయగా వుండండి" అన్నాడు ఇంగ్లీషులో.

వెడుతో మళ్ళీ వెనక్కితిరిగి, "ఎందుకంటే అతను చాలాఉత్తముడు"అని చరచరా వెళ్ళిపోయినాడు. అతనికళ్ళ నీళ్ళలోని నిళ్ళ పొరమీద ఎండ మెరిసిందా అనిపించింది.

ఎదట డేకింగ్‌మీద పిచికలు గోలచేస్తున్నాయి.

"అట్లాంటి మిత్రుడు దొరకడం చాలా అదృష్టం" అంది లాలస.

"కాని నాకు స్నేహాలమీద నమ్మకం నాశన మయింది లాలస వెళ్ళిపోవడంతో. అదే గొప్ప విషాదం జీవితానికి. ప్రియులైనవారు ద్రోహంచేస్తే ఆవియోగంబాధే కాదు, జీవితంలో విలువైన వారిమీద విశ్వాసంపోతుంది. అందువల్లే శుభ్రమైన మనుషులు సినిక్సు కావడం"అన్నాడు సింగ్ ఆమెవంక చూడకండా.

"ఆ లాలస ఎందుకు వెళ్ళిపోయిందో ఆ కథ నాకు చెప్పరాదూ?" అంది ఉత్త కప్పు బల్లమీద పెడుతో.

"చెప్పలేను."

"ఎందువల్ల?"

"నువ్వు ఆ లాలసవే గనక."

"మళ్లీ అదేమాటా?"

"ఎప్పటికీ జీవితమంతా అదేమాట."

"పోనీలే, నేనే లాలసనైనా, నీ పక్షాన, నీ లోపల ఆ లాలస వెళ్ళిపోవడం ఏవిధమైన చిహ్నాన్ని వొదిలింగో తెలుకోందామని.

"నేను ఆ కథనిచెపితే, నాకు న్యాయం జరగాలంటే నన్ను నేను చాలా పొగుడుకోవాలి."

"పోనీ, పొగుడుకోండి"

అతను వరండాలో పామ్సు ఆకుల చివర్లు చూస్తోనుంచున్నాడు.

'ఉహూ ! చెప్పలేను' అన్నాడు.

ఆమె అతనికి వీపుతిప్పి నుంచుంది.

'నిన్న రాత్రి నీ గదిలోకి వచ్చాను.' అని ఆమె అనగానే సింగ్ ఆమె పక్కకివెళ్ళి బుజంమీదచెయ్యేసి 'వచ్చావా ఎందుకు?' అన్నాడు.

'ఎందుకు ? నీమీద ప్రేమవల్ల.'

'వచ్చినట్టు కల వచ్చింది నాకు.'

'నీకు మెలుకువ రాలేదు.'

'లాలసా, లాలసా, ఇంక ఈ వృథా ప్రసంగానికి వ్యవధిలేదు. నేను వెళ్ళిపోతున్నాను. నువ్వు నావెంటనే రావాలి.'

అదేమిటి, ఈ వెర్రివాడు ఏమిటి మాట్లాడుతున్నాడు అన్నట్టు ఆశ్చర్యంతో చూసింది

'మాట్లాడవేం ?'

'అదేమిటి ? నేను మీవెంట రావడమేమిటి ?'

'నిన్న రాత్రి నా గదిలోకి వొచ్చినంత ప్రేమ వుంది కదా నీకు నామీద ?'

'వుంటే ?'

'అందుకనే నాతో రా.'

'అయితే రాత్రి గదిలోకి రాలేదు నేను.'

'వొచ్చాననన్నావు ?'

'కలలో వచ్చాను.'

'నాకా ?'

'కాదు, నా కలలో కూడా.'

'ఏమిటా భయం, దేశికాచారి అంటే?'

'కలలోనా ?'

'నిజంగా కూడా.'

'ఐతే ?'

'ఐతే ?'

'నాకేం భయంలేదు. ఆయన యెవర్నీ భయపెట్టరు. ముఖ్యంగా నన్ను భయపెట్టినా భయపడేదాన్ని కాదు.'

'మరి లాలసని ఒప్పుకోవేం ?'

'కాను గనక.'

'ఐతే నువ్వెవరవు ?'

'దేశికాచారి భార్యని'

'అసలు యే వూరు ? ఎప్పుడు పెళ్ళయింది మీకు?'

"అనవసరం."

"పోనీ నా సందేహం తీర్చడానికి!"

"ఏం లాభం?"

"నువ్వు నిజంగా లాలసవి కావని తెలిస్తే, దిగులు లేకండా వెళ్ళిపోతాను."

"నేను లాలసని కాకపోతే, నీకు నామీద ప్రేమ లేదా?"

"ఉహూ."

"ఐతే శీఘ్రంగా మీవూరు వెళ్లు."

"కోపం తెచ్చుకున్నావా?"

"తప్పకండా."

"ప్రేమ వుండకపోదు. కాని దేశికాచారి భార్యమీద నాకు ప్రేమ వొస్తేమాత్రం, నేను కనబరుస్తానా? ఇంకోరి కుటుంబాన్ని విచ్ఛిన్నం చేస్తానా?"

అతని ఈ నీతిపట్టుని చూసి ఆమె ఏమీ సంతోషించ లేదు. తన ప్రేమకి అభ్యంతరమైన నీతిమీద గౌరవం తక్కువ స్త్రీకి. అక్కడే సాధారణంగా ఉదారులైన సత్పురుషులకీ, వారు ప్రేమించే స్త్రీలకీ ఘర్షణ.

"ఒకవేళ నేను లాలసనే ఐ ఇప్పుడు దేశికాచారి భార్యనైతే?"

"పిల్లేను. 'లా' వొప్పుకోదు."

పొట్టలోనుంచి వచ్చే నవ్వుని ఆపుకుంటోంది లాలస.

"ఏమిటి" అన్నాడు సింగు.

"ఏం లేదు. లాయర్ల పడకగదుల్లోకి ప్రియాంగనలు వొస్తారుగాని, ప్రియాంగనల గదుల్లోకి 'లా' రాదు. ఎంత సంకుచితం ఈ నీతిపరుల మనస్సులు! ఇన్నేళ్ళ తరవాత

'లా' వొప్పుకోదని గొప్పగా అంటున్నారే అక్కడ నుంచుని!"

"అవును. దేశికాచారిగారికీ, 'లా' కీ చాలా దూరం."

"కాదు. చాలా దగ్గర. జైలుకి పంపింది మీ 'లా'."

"మీకు తెలుసునా ఆ విషయం?"

"ఆ విషయంలోనే నాకూ ఆయనకి పరిచయం అయింది"

"ఓ, కాని మీకు అట్లాంటి మనిషితో కాపరం అభ్యంతరం కాలేదు, అవునా?"

పాపం! పురుష హృదయం! ఎన్నటికీ స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకోలేని పురుషహృదయం.

"బ్యాంకులకీ ఇళ్ళల్లో ఇష్టాలకీ చాలా దూరం. ఆడ వాళ్ళం. బ్యాంకి వ్యవహారాలు మాకేం తెలుసు?" అంది వెక్కిరింపుగా, పేథటిక్‌గా—రెండూ కలిసి

"పోనీ 'లా' చేసినపని అన్యాయమేనంటావా?"

"ఇట్లాంటి విషయాలకి చాలా దృక్పథాలు వుంటాయి, ముఖ్యంగా నేరస్తుడి హృదయంలోకి చూడగలిగిననేత్రాలకి.

"ఎన్ని దృక్పథాలు వున్నా, తప్పు తప్పే, ఒప్పు వొప్పే."

"ఆసంగతి పోనీలే..."

"అన్ని సంగతులూ పోనీ నీకు నామీద ప్రేమ ఔనా కాదా?"

"ఔను."

"ఇంకేం?—రా వెళ్ళిపోదాం."

"ప్రేమ వుండడానికి పర్యవసానం వెళ్ళిపోవడమా?"

"కాక? ఇంకేమంటావు?"

"ప్రేమించుకోడం."

"భర్తని... కాదు తన పురుషుణ్ణే మోసగించి ఇంకోరి గదిలోకి రావడమా?"

ఆమాటకి చాలా బాధపడ్డది లాలస.

"అందుకనే ననుకుంటా ఆ లాలస నీ నించి వెళ్ళి పోయింది. ఇప్పుడు నాకు చాలా బాగా అర్థమౌతోంది."

"ఏమిటి?"

"ఏమిటి? నీతి చాలా గొప్ప విషయమూ, అవసర మైన విషయమూ కావొచ్చు. కాని నీతి గట్టిగా మనసుకి పట్టిన మనుషులు అందానికి అంధులౌతారనడంలోనే వుంది నీతిలోని నీచత్వం. ఎందుకంటే దేవుడే వుంటే అతను నీతి కన్న అందానికి చాలాదగ్గిర. సృష్టి అంతా అందం. ఒక్క కుచ్చితపు మానవుడిలోనే ఈ నీతి."

"నాకీ అందం తెలీదంటావా?"

"తెలుసునా? అంత నీచంగా మాట్లాడిన నీకు! నిన్న రాత్రి నీ గదిలోకి నేను రావడంలో నా హృదయంలో వెలిగిన ప్రేమ సౌందర్యం."

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆమె పెదవులు వొణికాయి.

ఎందుకు స్త్రీ హృదయం ఈపురుషులయెడల అర్థం కావాలి? అదే స్త్రీ పొందిన శాపం.

"కాని లాలసా..."

ఆ మాటకి ఆమెకి చాలా కోపం వొచ్చింది. అతన్ని చాలా అసహ్యించుకుంది.

"నాకు తెలుసు నువ్వేం మాట్లాడపోతున్నావో! దేశికాచారిగారే నన్ను నీ గదిలోకి పంపింది."

ఆ మాటకి సముద్రం అలలే ఆగిపోయి, వింతో చక నుంచున్నాయి.

అమితమైన వికృతంగా తోచింది లక్షణసింగ్‌కి ఆ దాంపత్యం. వీళ్ళిద్దరూ రాక్షసులా? మాట్లాడకండా, తిరిగి చూడకండా వెళ్ళిపోయినాడు ఆ మెట్లుదిగి.

ఇంటికి వెళ్ళగానే నరసింహారావు ప్రశ్నార్థకంగా చూశాడు.

"రా; భోజనానికి పద. భోజనం కాగానే వెళ్ళిపోతున్నాము. నన్నేమీ అడగకు. నాకేం అర్థం కావటం లేదు. రైల్లో మాట్లాడుకుందాం" అన్నాడు.

సామాను సర్దుకుని, బండి పిలిచి సామాన్లు పెట్టిస్తున్నారు. రోడ్డు చివరనించి కులాసాగా కర్రతిప్పుకుంటూ నోట్లో పైపుపెట్టుకుని దేశికాచారివొస్తున్నాడు. వెళ్లేవాళ్ళు ఎట్లాగూ ఆ దేశికాచారిని గదిలో పెట్టి మొత్తగా తన్నిపోతే, కొంత లోకోపకారం చేసిన వాళ్ళవుతారా అనిపించింది. ఒక్క-సాండ్రల్‌కి తగినశిక్ష చేసినవార మోతామను కున్నాడు సింగ్. సిగ్గులేక ఏం మొహంపెట్టుకుని వొస్తున్నాడు? వాళ్ళదగ్గరికివొచ్చి బండి ఆతసితో సామాన్లు మళ్ళీ లోపల పెట్టిస్తున్నాడు.

"ఇంక ఈ జిత్తులుమాను. మేం వెళ్ళితీరాలి" అన్నాడు సింగ్ చాలా అమర్యాదగా.

"రేపు మీ ప్రయాణం. ఈ రాత్రికి మీ ఇద్దర్నీ నాభార్య భోజనానికి తప్పక రమ్మంది" అన్నాడు అమర్యాదని గుర్తించ తలచుకోక.

"మేము రాము. ఇంక మీ ఇంటి గడప తొక్కం,"

"మావల్ల చాలా అపకారం పొందారా?" అన్నాడు చిరునవ్వుతో.

ఆలోచించారు. నిజమే. ఏం అపకారం చేశాడు?

"మిమ్మల్ని చూస్తే చాలా భయంగావుంది. నేను రాను."

"ఇంతవరకు ఏ నష్టము రాలేదు నావల్లగాని, ఆమె వల్లగాని మీకు. పోనీ ఈవూళ్లో యెవరికి రాలేదు. ఎందుకు భయం?"

"కాని మేం వెళ్ళాలి."

"ఎందుకు వెళ్లాలి?"

"ఎందుకు ఆగాలి?"

"ఆమెమీద మీకు చాలా ప్రేమగనక!"

"ఇప్పుడు లేదు."

"ప్రేమ ఒక్క ఉదయంలో నశించదు. ఎవరో ఆ లాలసట. ఆమెని చాలా గొప్పగా ప్రేమించానని చెపుతారు మళ్ళీ. చాలా తెలుసు ప్రేమ శాకు? ఒక్క ఉదయంలో నశించే ప్రేమ. ప్రేమ! ప్రేమ! ఎందుకు మాటల అర్థం తెలీకండా మాటలు మాట్లాడి మోసపుచ్చుకుంటారు."

"ఐతే నేను పొరబడ్డాను. అసలు నాకు ఆమెమీద ప్రేమ రానేలేదు."

ఏం మొగాడు ఆ దేశికాచారి? తనప్రియురాలిమీద ఇంకోమనిషికి ప్రేమఅని అతనితోనే నిదానంగా వాదిస్తున్నాడు. ఆ లాలసద్వారా, ఎందరికి ప్రేమ తెప్పించి, ఎంత డబ్బు లాగుతున్నాడో!

"మీకు ప్రేమ లేకపోలేదు. కాని ప్రేమ ఔన్నత్యం ఇంకా అర్థంకాలేదు మీకు. ఇంకా ఆ సిమితిత్వం రాలేదు మీకు. ఎందుకు ఇంత దూరం మిమ్మల్ని సహించి, వెంబడించి స్నేహం చేసుకున్నాను? ఎందుకు ఇప్పుడు బతిమాలుతున్నాను? మీమీద ప్రేమా నాకు? ఆమెకి మీమీద ఇష్టం. అందువల్ల నాకు ఇష్టం. తప్పకండా రండి రాత్రికి. చాలా ఇన్‌టరెస్టింగ్ కథ చెపుతాను. వెళ్ళారా చాలా పశ్చాత్తాప పడతారేమో ఆగలేదని?"

అంటో వాళ్ళవంక తిరిగి చూడకండా అంతహాయిగాను వెళ్ళిపోయినాడు కర్రతిప్పుకుంటూ, చెట్టుకిందనించి ఆ ఎత్తయిన రోడ్డుమీద.

*　　　*　　　*

రాత్రిచాలా చక్కని కబుర్లు చెప్పుకుంటో భోజనం చేశారు లాలసా, దేశికాచారి, నరసింహారావూ, లక్ష్మణసింగ్. చాలా గొప్ప భోజనం. అంత నాజూకైన, రుచిగల, అలంకారయుక్తమైన భోజనం ఇదివరకెన్నడూ చెయ్యలేదు

ఆ మిత్రులిద్దరూ. ఇంకెప్పుడూ చెయ్యాలనిపించింది. భోజనం తరవాత బంగళాకి దూరంగా, సముద్రాని కెదురుగా గచ్చు అరుగులమీద కూచున్నారు చీకట్లో.

"నా కథ ప్రారంభిస్తాను" అన్నాడు దేశికాచారి. ఎదురుగా ఒక్క స్త్రీ ఒక అరుగుమీద కూచునివుంది ఆమె. కట్టుకున్న చక్కని నీలంచీరెలోనుంచి ఆమె తెల్లనివాళ్లూ, కళ్లూ మాత్రం చీకట్లో మసకగా కనపడుతున్నాయి.

"నేను బ్యాంకిని మోసంచేసి జైలుకి వెళ్ళాను. ఆపని నేను ప్రేమించిన ఓ స్త్రీ కోసం చేశాను. నన్ను ఎరెస్టు చెయ్యగానే ఆమెకి హృదయంలేదని తెలిసింది నాకు. ఓ మిత్రుడి సహాయంతో నేను దొంగిలించిన సొమ్ముని ఆమెకి దక్కకుండా చేసి దాయించాను, అతని పేరు మాల్వంకర్" అని ఆగాడు ఎఫెక్టుకోసం.

"మాల్వంకర్! అతను ఆడబ్బునంతా ఏంచేశాడు?" అన్నాడు సింగ్.

"అక్కడే పొరబాటు. నేను జైలునించి ఎప్పుడు వస్తానా అని కనిపెట్టుకుని వుండి, అంతా వొడ్డీతోసహా నాకు వొప్పచెప్పాడు. ఏం ? విచిత్రంగా వుందా? అక్కడే మీకు జీవితం అర్థంకానిది. మాల్వంకర్ స్త్రీ విషయంలో చాలా దుర్మార్గుడు. కాని దుర్మార్గుడూ కాడు అతని స్వభావం అది. అతనికి సంగీతంతప్ప ఇంకేం అక్కర్లేదు. సంగీతాన్ని అర్థం చేసుకొనేవాళ్ళని వొదలలేదు. డబ్బుకి గానం అర్థంకాదు కనక డబ్బుమీద ఆశలేదు. స్త్రీకి అర్థ

మాతుంది గనక స్త్రీమీద కోర్కె. కాని ఎప్పటి కప్పుడు కొత్త ఆరాధికాలు కావాలి, అందరు ఆర్టిస్టులకు మల్లేనే."

అని మళ్ళీ ఆగి పైపు ముట్టించుకున్నాడు. చాలా తాపీగావుండే దేశికాచారి ఆ కథ చెప్పడంలో తబ్బిబ్బు లవుతున్నట్టున్నాడు. మాల్వాంకర్ పేరు వినగానే సింగ్ చెవులు నిక్కపొడుచుకున్నాయి. చీకటిని చీల్చుకుని తరవాత మాటలకోసం చూస్తున్నాడు, వింటున్నానని మరచి.

"అతని ఇంటోనే బసచేశాను. ఆ ధనమంతా, నాకు తెలిసినంతవరకు నా మూలాన నష్టపడ్డ బీదకుటుంబాలకి పంచుతున్నాను. అతని ఇంటో లాలస అని ఒకామెవుంది" అని ఆగాడు మళ్లీ. లాలస కొంచెంగా కదిలింది.

"కాని ఆనాటినించి నిన్న రాత్రి వరకు నాకు ఆమె పేరు లాలస అని గాని, ఆమె ఎవరిభార్యో, ఎక్కణ్ణించి వచ్చిందోగానీ తెలీదు. మాల్వాంకర్ ఆమె తన భార్యేనని చెప్పాడు."

అని మళ్ళీ ఆగాడు, తనని ఎవరన్నా ఏమన్నా ? ప్రశ్నలేస్తారేమో నన్నట్టు.

"నాకు తెలీదంటే నమ్మరు. కాని ఏదైనా ఒక అసాధారణమైన, అమూల్యమైన వరం దొరికినప్పుడు దాని పుట్టుపూర్వోత్తరాలు గాని, దాని విలువగాని పరీక్షించడానికి భయపడతారు మనుషులు. ప్రతి ఉదయం, 'ఇది నిజమేనా? ఈ మహావరం నా ఇంటో, నన్నిష్టపడుతో నిలిచి వుందా?' అని నమ్మలేక ప్రశ్నించే అద్భుతంలో, ఇంకే ఆలోచనా వుండదు. ఆ అదృష్టం చాలు. దాంటో నిలవ

గలగడం చాలు. అంతకన్న ఇంకేం కావాలి? అనిపిస్తుంది. పోనీ నా స్వభావం అట్లాంటిది" అని ఆగి, పైపు పీలుస్తున్నాడు.

"తరవాత" అన్నాడు సింగ్ నిలవలేక. కథ చెప్పక చెప్పక ఈ విజ్ఞానపు వాక్యాలెందుకు మధ్య అని కోపం కూడా వచ్చింది సింగ్‌కి.

"మాల్వాంకర్ వల్ల చాలా కష్టం, అవమానం, దరిద్రం అనుభవిస్తోంది ఆమె. మాల్వాంకర్‌కి డబ్బులేదు అప్పుడు. తాగుబోతు. కాని అతను దరిద్రంలోనూ తనదగ్గరవున్న నా అన్యాయార్జిత విత్తాన్ని కూడా తాకలేదంటే, మోచించుకోండి అతని గొప్పతనం. అయితేనేం లాలసని చాలా యాతన పెడుతున్నాడు. కలుగజేసుకున్నాను. కాని లాభంలేదు. మాల్వాంకర్‌తో ఏం లాభంలేదు. నిజమైన వ్యక్తిత్వంగల ఏం మనిషితోనూ లాభంలేదు. మిత్రుల సలహాలు తీసుకునే మనుషులు వివేకహీనులు, దుర్బలులు" మళ్ళీ ఆగాడు.

సింగ్‌కి దేశికాచారిమీద కోపం హెచ్చుతోంది. మాల్వాంకర్ మహనీయుడట.

"మొదటినించీ లాలస ప్రత్యేకమైన స్త్రీ అని తెలుసు నాకు. అట్లాంటి స్త్రీని జన్మలో ఒక్కసారి కలుసుకోడంకూడా గొప్ప అదృష్టం. ఆమెని చూస్తోంటేనే, జీవితం ఎంతలోతో, ఎంత అందమో, చాలా నేర్చుకుంటాము. ఆమె ఈ మాల్వాంకర్ పాల ఎట్లా పడ్డదా అని నా ఆశ్చర్యం. కల్పించుకుని ఓ సాయంత్రం ఆమెతో మాట్లాడి, ఆమెని

మాల్వాంకర్ దగ్గరనించి వెళ్లిపోమన్నాను. కాని వెళ్ళనంది. గొప్ప వ్యక్తు లందరిలోవుండే గుణాలు, కష్టాలలో సహనం, తను ప్రేమించే మనిషి స్వర్గానికి మారతాడనే ఎడతెగని విశ్వాసం, తాను మార్చగలననే ధైర్యం, అపరిమితం ఆమెలో. చాలా దిగులుపడి వెళ్ళిపోయినాను నేను, ఆ వూరినించి ఆమె వ్యధని చూడలేక. నేను జీవితాన్ని ఎక్కువగా చూసినవాణ్ణి కావడంవల్ల ఆమె ఆశలన్నీ వ్యర్థమని తెలిసి అవసరమైనప్పుడు ఆమె జన్మకి, ఆమె మిత్రుణ్ణని చెప్పాను వెళ్ళేముందు."

మళ్లీ ఆగాడు.

"హఠాత్తుగా ఓ రాత్రి నా దగ్గిరికి వొచ్చేసింది ఈమె. అప్పుడు నేను బతిమాలగా చూచాయగా చెప్పింది, తనకి భర్తవున్న సంగతి. బలవంతాన ఆ భర్తకి ఉత్తరం కూడా రాయించాను. జవాబు రాలేదు. ఆనాటినించి ఈనాటివరకు మేమిట్లా కలిసి కాపరం చేస్తున్నాము. ఈమెని చూసినప్పటినుంచి, లక్ష్మణసింగ్ ఏదో నా యెడల అనుమాన పడుతో మారిపోయినాడనీ, ఈమెకూడా భయపడి తటపటా యిస్తోందనీ గమనించాను. ఆమె పూర్వజన్మ జీవితంలోంచి ఏవో జ్ఞాపకాల్ని ఆయన తీసుకొచ్చాడనికూడా తెలిసింది. కాని ఆమెనేం అడగలేదు నేను—అడగడం చాలా అనవసరమైన యాతన గనక. నేనేదో ఆమెని ఆయననించి దాస్తున్నానని మీకు నామీద అనుమానం, కోపం. అదీ తెలుసు నాకు. నిన్నరాత్రి ఈమె సింగ్‌గారిని ప్రేమగా వొళ్ళో పడుక్కోపెట్టుకోవడం చూసిన తరవాత, అడిగాను

ఆమెని ఏమిటి వ్యవహారమని. అప్పుడు చెప్పింది ఆమె తన చరిత్రని. అంతే నేను చెప్పతలుచుకున్నది. ఇంకేమన్నా అడగాలని వుంటే అడగండి"

"మరి ముందుసంగతి ఏమిటి?" అన్నాడు నరసింహారావు.

"ముందుసంగతి ఏమిటి? అనే ప్రశ్న నాలోవచ్చి చాలా ఏళ్ళయింది. అది వాళ్ళిద్దరే నిర్ణయించుకోవాలి. ఆ సమస్యలో నాకు పెద్ద భాగం వుంది, నేను దాన్ని ఉపసంహరించుకుంటున్నాను. వాళ్ళిద్దరే నిర్ణయించుకోవాలి. రేపు మీ ప్రయాణం తప్పదు. మీరు వెళ్ళకపోతే నేను వెళ్ళిపోతాను. ఇప్పటికే అందమైన, అమూల్యమైన జీవిత కాలంలో కొద్దిరోజులు గొడవతో వ్యర్థమైనాయి. ఈరాత్రే ఏదోవిధంగా తేలిపోవాలి"

జీవితాదర్శం, శాంతి.

ఆ శాంతిని భగ్నంచేసే ఏ సుఖమూ, ఏ గొప్పతనమూ, ఏ శృంగారమూ, నా జీవితానికి చాలా విరోధం. అంటే శాంతిని భగ్నం చేసేది సుఖమూకాదు, గొప్పతనమూకాదు, శృంగారమూకాదు.

"రండి నరసింహారావుగారూ! ఓ గంట షికారు పోయివద్దాం" అని లేచాడు.

"ఒక్కమాట. మీకామెమీద ఎట్లాంటి ప్రేమ?" అన్నాడు లక్షణసింగ్.

"నాకా? ఎట్లాంటిప్రేమా? రసికుడైన పురుషుడికి లావణ్యవతియైన స్త్రీమీద వుండే ప్రేమా? అనికాదు

బహుశా మీరు నన్నడుగుతోంది. ఎంతప్రేమ? అని. ఈమెని మీరు తీసుకొనివెడితే, నాకు అన్యాయం చేస్తున్నానా అని మీబాధ. మీకు జ్ఞానం తక్కువ. కాని చాలా మంచి హృదయంమీది. దిక్కులేని ఆమెని ఇన్నాళ్ళు చేర తీసినందుకు నాకు ఆమెమీద ఏదో కొంత హక్కు వుందని అంగీకరిస్తున్నారు. మీరు మాట్లాడే 'లా' లో అదేంలేదు. కాని మీలో వుంది ఆ సుహృద్భావం. నేను చెప్పానుగా నా హక్కుని వొదులుకుంటున్నానని.

ఈమె వెళ్ళిపోతే నేనేమైపోతానో అనికూడా యోచిస్తారు బహుశా. ఆమె యోచించింది. ఆమె వెళ్ళడం చాలా బాధే. కాని వెళ్ళాలనుకుంటే ఆమెని ఏ విధానోన్న, ఏ కృతజ్ఞతనో బోధించి వుంచుకోడం నాకు బాధేకాదు – అసహ్యం, నీచం. స్త్రీ యెడల ప్రేమగలిగిన మనిషి చేసే పనికాదు అది. గుడ్ బై. బలవంతపరిచి ఆమె సామాన్లు సర్దించాను. నేను తిరిగి వచ్చేటప్పటికి మీరు ఇక్కణ్ణించి వెళ్ళిపోండి–ఆమెతో సహా, లేక ఆమె నిక్కడ వొదిలో. గుడ్ బై."

అని వెళ్ళిపోయినాడు.

ఆ రాత్రి చీకట్లో సముద్రపుహోరులో, నక్షత్రాల కాంతికింద సింగ్ ప్రశ్నించాడు లాలసని.

"ఆయన చెప్పినదంతా నిజమేనా?"

"ఆ!"

"నామీద నీకు ప్రేమేనా?"

"ఆ!"

"మరి ఇన్నాళ్ళు ఎందుకు లాలసని కాదన్నావు?"

"దానికి ప్రత్యుత్తరం మీరు వెయ్యబొయ్యే చివరి ప్రశ్నలో వుంది."

"రావా?"

"రాను."

"ఎందుకు లాలసా?"

"మీరు చాలా మంచివారు. గొప్ప హృదయం. నేను ...యా ఇంటినించి వెళ్ళిపోయినప్పుడు మీరు ఎంత ఉదార ...త్వాన్ని చూపారో నాకు తెలుసు. కాని సముద్రంలో ...చాపని ఎంత ప్రేమించీ నేలమీద సుఖపెట్టలేము. మీకూ ...నాకూ మధ్య గొప్ప ప్రేమ, శృంగారము. నాకూ ఆయనకీ ...మధ్య ఎన్నడూ ప్రేమ లేదు. విడవలేనితనం. ఆశా, ఉద్రేకం, ...వేమీ లేవు. కాని మా మధ్య గొప్ప ఐక్యం, శాంతి. ఎందు...ంటే ఆయన ఏ పట్టూ ఏ ప్రెజుడిసెస్ లేకండా జీవితాన్ని ...ధించి, సుఖపడే రహస్యాన్ని కనిపెట్టారు. మీతో వస్తే ...ల్ళీ మొదలు నా హక్కులకోసం తగాదా, మర్యాదలు, ...ంధుత్వాలు, డబ్బు, మిత్రులు. ఆయనతో తగాదా లేదు. ...చాలా సంతోషంగా నా అభిప్రాయాలు, నా హక్కులు, ...ర్కులు అన్నీ ఆయన చేతికి వొప్పచెప్పాను. ఆయనలో ...మకి అతీతమైన శాంతి—ఎందుకంటే ఆయనకి కోర్కెలూ ...యాలూ లేవు. బాధని తప్పించుకోడంలో నేర్పరి. కాని ...ధని చూస్తే భయం లేదు. ఆయన హృదయంలో శాంతి, ...శంలో మల్లె. గొడవపడను నేను రాను.

* * *

దేశికాచారి తిరిగి వొచ్చేటప్పటికి లాలస వొక్కత్తె
కూచునివుంది అరుగుమీద

“రా. లాలసా, చాలా పొద్దుపోయింది.”

లాలస లేచి అతని చేతిని పట్టుకుంది.

“సింగూ, నరసింహారావు ఏరి?”

“వెళ్ళిపోయినారు.”

బొడ్డుమల్లెల మధ్య సన్నగావున్న కాలిబాట వెంట
దేశికాచారి వెనక నడుస్తో లాలస నవ్వుతోంది.

“నవ్వుతున్నావా?”

“అవును. ఒకవేళ మీరు తిరిగి వొచ్చేటప్పటికి నేను
లేకుండా వున్నట్టయితే అట్లాగే, ‘పొద్దుపోయింది’ అని
వెళ్ళి వొంటరిగా పడుకునేవారు. అవునా?”

“ఊఁ” అన్నాడు. కాని ఆ “ఊఁలో” చాలా కంపనం
వినిపించింది లాలసకి.







## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TRLA 109 B153 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 26-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Aswini |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | akshaya |
| పరీక్ష చేసినది | ASWINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |